# పండుగలు ఆచరించు విధము

చైత్ర శు॥ పూర్ణిమ 8-4-2001, ఆదివారము రోజు హనుమజ్జయంతి ఉపవాసము చేసి సూర్యోదయము వేళ హనుమంతుని జన్మోత్సవమును చేయవలెను. ఇదే రోజు ప్రొద్దున సూర్యోదయము వేళ హనుమంతుని జన్మోత్సవమును చేయవలెను. ఇదే రోజు ప్రొద్దున వైశాఖ మాస ప్రాతఃకాలస్నానములు చేయుట ఆరంభించవలెను. దీని సంకల్పము.

శ్లో॥ వైశాఖ సకలంమాసం మేష సంక్రమణేరవేః। ప్రాతః సనియమఃస్నాస్యే ప్రీయతాం మధుసూదనః॥
మధుహంతు ప్రసాదేన బ్రహ్మణానామనుగ్రహాత్। నిర్విఘ్నమస్తు మేపుణ్యం వైశాఖ సమన్వహం॥
మాధవేమేషగేభానౌమురే మధుసూదన॥ ప్రాతఃస్నానేనమేనాథఫలదోభవపాపహాన్ ॥

ఈ మంత్రముచే ప్రాతఃకాలము, స్నానమును చేయవలెను. బ్రహ్మచర్యమును వైశాఖ మాసపర్యంతము పాటించిన విశేషము.

వైశా॥ శు॥తదియ 26-4-2001, గురువారము రోజున పరశురామ జన్మోత్సవం పరశురాముని పూజించి వారికి అర్ఘ్యప్రధానము చేయాలి.

శ్లో॥ జమదగ్ని సుతోవీరక్షత్రియాంతకరప్రభో । గృహాణార్ఘ్యంమయాదత్తంకృపయాపరమేశ్వర।

వైశాఖ శు॥ తదియ 26-4-2001, గురువారము రోజున దేవతాపితృల్నుద్దేశించి ఉదకుంభదానము చేయాలి. కలశానికి కంకణము కట్టి నీటిని నింపి గంధపుష్పాక్షితలతో పూజించి శ్రీ పరమేశ్వర ప్రీతిద్వారా ఉదకకుంభకల్పోక్తఫలావాప్త్యర్థంబ్రాహ్మణాయ ఉదక కుంభదానమహం కరిష్యే। ఈ సంకల్పము చేసి

శ్లో॥ ఏషధర్మఘటోదత్తో బ్రహ్మవిష్ణుశివాత్మకః । అస్యప్రదానాత్తృప్యంతు పితరోపిపితామహాః ॥
దేవతాప్రీత్యర్థం ॥ ఇది దేవతల గూర్చి దానమీయవలెను.

శ్లో॥ గంధోదకతిలైర్మిశ్రంసాన్నంకుంభం ఫలాన్వితం । పితృభ్య సంప్రదాస్యామి అక్షయ్యముపతిష్టతు॥
పితురుల కొరకు కుంభదానము చేయాలి.

జ్యే॥ శు ఏకాదశి, 2-6-2001, శనివారము రోజున నిర్జలేకాదశి ఈ దినమున నిత్యనైమిత్తకము (సంధ్యావందనము) రోజటిమాదిరిగా కాకుండా ఆచమనము నీళ్ళు త్రాగకుండా చేయవలెను. ఈ రోజునీళ్ళను త్రాగకూడదు. ఉపవాసము చేయవలెను. తెల్లవారు శనివారము ద్వాదశి రోజు ఈ ఏకాదశి వ్రత సంపూర్ణవ్రత ప్రాప్త్యర్థం శర్కరాయుక్త. సువర్ణయుక్తముగా, ఉదకకుంభమును పూజించి (సంకల్పం) నిర్జలో పోషితైకాదశి వ్రతాంగత్వేనసహిరణ్యసశర్క రోదకకుంభదానం కరిష్యే। అని సంకల్పము చేసి ఆకుంభమును.

శ్లో॥ దేవదేవ హృషీకేశసం సారార్ణవతారక । ఉదకకుంభప్రదానేనయాస్యామిపరమాగతి ॥
బ్రాహ్మణులకు దానమీయవలెను.

జ్యేష్టమాసమున శీతతాపనివారణార్థం బ్రాహ్మణులకు చందనము, విసనకఱ్ఱ, జలకుంభము, ఇత్యాది దానములు చేయవలెను. జ్యే॥ శు॥ ప్రతిపద దశహరావ్రతము ప్రారంభించవలెను. ఈ రోజు మొదలు శుక్ల దశమి వరకు ప్రతిదినము గంగాస్నానము చేయవలెను. జ్యే॥ శు॥ ప్రతిపద రోజున కరవ్రతమును చేయవలెను. దశమి రోజున గంగోత్పత్తి అయినది. ఈ రోజు గంగను పూజించి జలప్రవాహములో దీపమును విడిచి

శ్లో॥ గంగాగంగేతియోబ్రూయాత్యోజనానాంశతైరపి। ముచ్యతేసర్వపాపేభ్యో విష్ణులోకంసగచ్ఛతి॥ ఈ శ్లోకముచే గంగను ప్రార్థించవలెను.

ఆషాఢ శు॥ ఏకాదశి 1-7-2001, ఆదివారము రోజు నుండి చాతుర్మాస్యారంభము శంఖ, చక్ర, గదా పద్మములతో సహిత విష్ణుమూర్తిని పూజించి కులాచారప్రకారము ఉపవాసము చేసి శ్లో॥ సుప్తేయిజగన్నాథేజగత్సుప్తంభవేదిదం । విబుద్దేత్వయితత్సర్వం సచరాచరం ॥

ఈ ప్రకారము ధ్యానించవలెను. ఆ రోజు సాయంత్రం విష్ణువును పూజించి

శ్లో॥ చతురోవార్షికాన్మాసాన్దేవస్యోత్థాపనావధి। ఇమం కరిష్యే నియమం నిర్విఘ్నంకురుమేచ్యుత॥
ఇదంవ్రతం మయాదేవగృహీతంపురతస్తవ। నిర్విఘ్నం సిద్ధిమాయాతుప్రసాదాత్తవకేశవ॥
గృహితేస్మిన్వ్రతేదేవపంచత్వంయదిమేభవేత్ । తదాభవతు సంపూర్ణంత్వత్ప్రసాదాజ్జనార్దన।

ఈ విధముగా ప్రార్థించవలెను. శ్రావణ మాసమున శాకవర్జ్యము ఫలసహితము. పసుపు, జీలకర్ర, సొంటి, వీటిని కూడా వర్జించవలెను. భాద్రపదమాసమున పెరుగు వర్జ్యము, ఆశ్వీయుజమాసమున పాలు వర్జ్యము, కార్తీకమాసమున ద్విదళ ధాన్యములు వర్జ్యము, ఈ ప్రకారముగా ప్రతి మాసమున ఒకటి వదలవలయును. ఈ వ్రతము శు॥ ఏకాదశి నుండి ప్రారంభించవలెను. సన్యాసులు శుక్ల పూర్ణిమ తేది 5-7-2001, గురువారము నుండి ఈ వ్రతమును క్షౌరము చేసుకొని వ్యాసమండలమును సపరివార శ్రీకృష్ణుని పూజించవలెను. ఈ వ్రతమును భర్తలేని స్త్రీలు, భార్యలేనివారు కూడా ఆచరించవలెను.

శ్లో॥ అహంతావన్ని వత్స్యామిసర్వభూతహితాయవై। ప్రాయేణప్రావృషిప్రాణి సంకులంవర్త్మదృశ్యతే। అతస్తేషాం మహీంసార్థంపక్షాన్షైశృతిసంశ్రయాన్ । స్తాస్యామశ్చతురోమాసాన్ అత్రైవసతి బాధకే॥

శ్రావణ శుక్ల ద్వాదశి 31-7-2001, శుక్రవారము వరకు చాతుర్మాస్య మొదటిమాసము సంపూర్ణము. ఈ నెలయందు శాకము వర్జించినాము కనుక దాని ఫలార్థం మాసకృత్య శాకవర్జన వ్రతస్యసాం గతాసిద్ధ్యర్థం బ్రాహ్మణాయశాకదానం కరిష్యే। అని సంకల్పించి

శ్లో॥ ఉపాయనమిదం దేవవ్రతసంపూర్ణ హేతవే। శాకం తుద్విజవర్యాయహిరణ్యం, దదామ్యహం॥

ఈ శ్లోకము నుచ్చరించి సదక్షిణ సహితము శాకదానము చేయవలెను. ద్వాదశి నుండి దధి భాద్రపదేమాసి వర్జయేత్ ॥ నెలరోజులు పెరుగు వదలవలెను.

శ్రావణ బ॥ సప్తమి 11-8-2001, శనివారము రోజు శ్రీకృష్ణ జన్మాష్టమి ఉత్సవము గోపాలకాల శ్రీకృష్ణ జన్మమును కృష్ణ పూజను చేయవలెను.

శ్లో॥ గాయద్భిఃకిన్నరాద్యైఃసతతపరివృతావేణువీణానినాదై। శృంగారాదర్శకుంభప్రవరకృతకరైః కింకరై సేవ్యమానా।

పర్యంకెస్వాస్తుతెయాముదితతరముఖీ పుత్రిణీ సమ్యగాస్తే
సాదేవి దేవమాతాజయతిసుతనయో దేవకీ కాంతిరూపా ॥

శ్రావణ బ॥ అమావాస్య 18-8-2001, ఆదివారము రోజు వృషభ పూజను చేయవలెను. ఈ రోజు దర్భను కోయవలెను.

భాద్ర॥ శు॥ తదియ 21-8-2001, మంగళవారము రోజున హరితాలికా, షోడశోమావ్రతమును చేయాలి. శివపార్వతులను పూజించవలెను.

శ్లో॥ మందారమాలాంకులితాలకాయైకపాలమాలాంకిత శేఖరాయ।
దివ్యాంబరాయైచ దిగంబరాయనమః శివాయైచనమః శివాయ ॥

భా॥ శు చవితి 22-8-2001, బుదవారము ఈ రోజున అపరాహ్నవ్యాప్తిని చవితి తిథి ఉంది. కనుక వినాయక చవితివ్రతము నాచరించవలెను. సిద్ధివినాయకుని స్థాపన చేసి ఇరువది ఒక్క దుర్వాలచే (గరచేక పూజించి) మోదకములను నివేదన చేయవలెను. ఈ రోజురాత్రి చంద్రుని చూడకూడదు. చూచిన దోషము మిధ్యా అపవాదులు వచ్చును. దోషనివారణార్థము ఈ శ్లోకమును శ్లో॥ సింహప్రసేనమవధసింహోజాంబవతాహతః॥ సుకుమారకమారోదీస్తవహ్యేషస్యమంతకః॥ ధ్యానించవలెను.

అశ్వీ॥ శు॥దశమి తేది 26-10-2001, శుక్రవారము రోజున విజయదశమి.

శమీపూజ : శ్లో॥ అమంగలానాంశమనీశనీదుష్కృతస్యచ।
దుఃఖప్రణాశినీంధన్యాం ప్రపద్యేహం శమీంశుభాం ॥

ప్రార్థన : శ్లో॥ శమీశమయతే పాపంశమీలోహితకంటకా॥ దరిత్ర్యర్జునభాణానాంరామస్యప్రియవాదినీ కరిష్యమాణయాత్రాయాంయథాకాలంసుఖంమయా । తత్ర నిర్విఘ్న కర్త్రీత్వంభవ శ్రీరామపూజితే ।

అశ్మంతన ప్రార్థన : శ్లో॥ అశ్మంతకమహావృక్ష మహాదోష నివారణ ।
ఇష్టానాందర్శనందేహిశత్రూణాంచ వినాశనం ॥

అశ్వీ॥ బ॥ త్రయోదశి, 12-11-2001, సోమవారం రోజు ప్రదోషకాలముకు త్రయోదశి తిథి కలదు కనుక ఇంటి యందు దీపమునుంచవలెను.

శ్లో॥ మృత్యునాపాశదండాభ్యాంకాలేనశ్యామయాసహ॥ త్రయోదశ్యాందీపదానాత్సూర్యజః ప్రీయతాంమమ॥

ఈ శ్లోకము నుచ్చరించి బ్రాహ్మణులకు దీపదానమును చేయవలెను. మంగళవారము రోజున ఉదయము చతుర్దశి స్నానము చంద్రోదయమైన పిదప సూర్యోదయాత్పూర్వము చేయవలెను.

మాఘ॥ శుక్ల ఏకా, పౌర్ణిమ, బ॥అమావాస్య ఈ మూడు దినములలో ఏ దినమునుండైనా మాఘమాస ఉదయాత్పూర్వస్నానారంభము ఒక నెల పర్యంతము చేయవలెను. అరుణోదయము మొదలు ప్రాతఃకాలము వరకు స్నానమునకు ముఖ్యకాలము మకరసంక్రాంతి వరకు చేసిన మహాపుణ్యము మరియు సమస్తరోగములు నశించును. ఉదయాత్పూర్వము నక్షత్రములు ఉన్నపుడు చేసినస్నానము ఉత్తమము. నక్షత్రములు కనపడక సూర్యోదయమునకు ముందుగా స్నానము మధ్యమము, సూర్యోదయానంతరము స్నానము చేసిన అధమము.

ఈ మాఘమాస స్నానమును బ్రహ్మచారులు, గృహస్తులు వానప్రస్తులు, సన్యాసులు, బాల, తరుణ, వృద్ధ, స్త్రీ, పురుషులు ఉదయాత్పూర్వము బావి, తటాక, నదీ, మహానదులు, మహానదుల సంగమస్థలము, గంగానదీ, గంగా యమునా సంగమస్థలము గోదావర్యాధి పుణ్యస్థలముల జలము ఉత్తమమైనది సముద్రస్నానము ఉత్తమోతత్తమము । చల్లటి నీళ్ళ స్నానము ఉత్తమము వృద్ధ, రోగ, బాల, గర్భవతీ స్త్రీలకు వేడినీళ్ళ స్నానము చేయవచ్చును. ఎక్కడ స్నానము చేసినను ప్రయాగ స్మరణము చేయవలెను.

శ్లో॥ దుఃఖదారిద్ర్యనాశాయ శ్రీ విష్ణోస్తోషణాయచ । ప్రాతఃస్నానంకరోమ్యద్యమాఘేపాపవినాశనం।
మకరస్థే । వమాఘేగోవిందాచ్యుతమాధవ॥ స్నానేనానేనమేదేవయథోక్తఫలదోభవ॥

ఈ శ్లోకమునుచ్చరించి మౌనముగా స్నానమాచరించవలెను. ప్రతిరోజు ప్రాతఃస్నానానంతరము సూర్యునికి అర్ఘ్యప్రదానము ఈ క్రింది శ్లోకముచ్చరించి విడువవలయును.

శ్లో॥ సవిత్రేప్రసవిత్రేచపరంధామజలేమమ॥ త్వత్తేజసాపరిభ్రష్టం పాపంయాతుసహస్రధా॥

తదనంతరం సంధ్యావందన పితృతర్పణాది నిత్యవిధులు ఆచరించి మాధవుని పూజించవలెను. మాఘమాసమునెండుకట్టెలు,కప్పుకొనుటకు వస్త్రములు, చెప్పులు, సువర్ణము, అన్నదానము, (ప్రతి రోజు, తిల, శర్కరాదానములు) చేసిన అనంత పుణ్యఫలము, సుఖసౌభాగ్య ఆరోగ్యము కలుగును.

మాఘ॥ శు రథ సప్తమి తేది 19-2-2002, మంగళవారం రోజైనా ప్రాతఃకాలమున అశక్తులు కూడా స్నానమాచరించవలెను. స్నానమంత్రము

శ్లో॥ యదాజన్మకృతంపాపంమయాజన్మసుజన్మసు॥ తన్మేరోగంచశోకంచమాకరీహంతుసప్తమీ॥
ఏతజ్జన్మకృతంపాపంయచ్చజన్మాంతరార్జితం॥ మనోవాక్కాయజంయచ్చజ్ఞాతాజ్ఞాతేచయేపునః॥
ఇతి సప్తవిధం పాపం స్నానేన్మేసప్తసప్తికే॥ సప్తవ్యాధి సమాయుక్తం హరమాకరిసప్తమి ।

ఈ మంత్రమనుచు స్నానము చేయవలెను. మాఘ॥ బ॥చతుర్దశి, 12-3-2002, మంగళవారము శివరాత్రి రోజు ఉపవాసమాచరించి శివునికి రుద్రాభిషేకము బిల్వదళపత్రపూజ నాచరించిన సమస్త పాపములు నశించి శుభములు కలుగును.

పాల్గుణ శు॥ చతుర్దశి, తేది 27-3-2002, బుదవారము రోజు రాత్రి పూర్ణిమ కలదు. కావున హోలికాపూజను, కామదహనము చేయవలెను. సంకల్పముః సహకుటుంబస్యమమ ధుండారాక్షసీ ప్రీత్యర్థం తత్పీడాపరిహారార్థం హోలికాపూజనమహంకరిష్యే ॥

శ్లో॥ అసృక్పాభయసంత్రస్తైఃకృతాత్వంహోలిబాలశైః॥ అతస్త్వాంపూజయిష్యామిభూతే భూతి ప్రదాభవ॥

ఈ పూజామంత్రముచే శ్రీ హోలికాయైనమః హోలికామావాహయామి ఈ విధముగా హోలికాదేవిని ఆహ్వానించి శ్రీ హోలికాయైనమః ఈ మంత్రముచే ఆసన, పాద్య, అర్ఘ్య ఆచమన ఇత్యాది షోడశోపచార పూజను చేయవలెను.

# గోత్రప్రవరకోష్టకము

1. వసిష్ఠ : 1. వాసిష్ఠ 1 2. వాసిష్ఠ మైత్రావరణ కౌండిన్య 3
2. ఉపమన్యు (వసిష్ఠ) గోత్ర: వాసిష్ఠ ఆభరద్వాజన ఐంద్రప్రమద 3
3. పరాశర : వాసిష్ట శాక్తేయ, పారాశర్య 3
4. కౌండిన్య : వాసిష్ఠమైత్రావరుణ కౌండిన్య 3
5. జాతుకర్ణ గోత్ర : వాసిష్ట ఆత్రేయజాతుకర్ణ
6. కాశ్యపగోత్ర : కాశ్యపావత్సార అసిత 3, కాశ్యప ఆవత్సనైధ్రువ 3, కాశ్యప ఆవత్సారనైధ్రువరేభ, రైభ, శాండిల్య 5
7. శాండిల్య : శాండిల్య అసితదేవేతి 3, కాశ్యప అసితదైవల 3, కాశ్యపావత్యార అసిత 3, కాశ్యపావత్సారశాండిల్య 3, అసిత దైవలకాశ్యప 3
8. రైభ్యగోత్ర : కాశ్యప ఆవత్సారరైభ్య 3
9. నైధ్రువగోత్ర : కాశ్యప అవత్సారనైధ్రువ 3
10. తాగాక్షి గోత్ర : కాశ్యప ఆవత్సావాసిష్ఠ 3, వాసిష్ట ఆవత్సారవాసిష్ట 3
11. విశ్వామిత్ర గోత్ర : విశ్వామిత్ర దేవరాతజౌదల 3
12. దైవతరసగోత్ర : విశ్వామిత్రదైవశ్రవసదేవతరస 5
13. ధనంజయగోత్ర : విశ్వామిత్రమాధుచ్ఛంధసధానంజయ 5
14. అజగోత్ర : విశ్వామిత్రమాధుచ్ఛందస అజ 3, విశ్వామిత్ర ఆశ్మరత్య వాధులు 3
15. రౌహిణగోత్ర : విశ్వామిత్రమాధుచ్ఛందసరౌహిణ 3
16. అష్టకగోత్ర : విశ్వామిత్ర మాధుచ్ఛందస అష్టక 3, విశ్వామిత్ర అష్టక 2
17. పూరణగోత్ర : విశ్వామిత్రదేవ రాతపౌరణ 3
18. పౌరణ గోత్ర : విశ్వామిత్రపౌరణ 2
19. కాత్యగోత్ర : విశ్వామిత్రకాత్యఆక్షీల 3, సాతిసాలిద్వారివిశ్వామిత్ర 3
20. అఘమర్షణ గోత్ర : విశ్వామిత్ర అఘమర్షిణకౌశిక 3
21. రైవణగోత్ర : విశ్వామిత్రగాధినరైవణ 3
22. రౌక్షకగోత్ర : విశ్వామిత్రరౌక్షకరైవణ 3, విశ్వామిత్రగాధినరైవణ 3
23. వైణవగోత్ర : విశ్వామిత్రగాధినవైణవ 3
24. శాలంకాయనగోత్ర : విశ్వామిత్రశాలంకాయనకౌశిక 3
25. ఇంద్రకౌశికగోత్ర : విశ్వామిత్ర ఐంద్రికౌశిక 3
26. సాహులగోత్ర : విశ్వామిత్రసాహులమాహుల3
27. హిరణ్యరేతసగోత్ర : విశ్వామిత్ర హైరణ్యరేతస3
28. సువర్ణరేతన గోత్ర : విశ్వామిత్రకాపాతరస 2
29. జమదగ్నిగోత్ర : భార్గవచ్యవన అప్నవాన ఔర్వజామదగ్ని5, భార్గవ ఔర్వజామదగ్ని3, జామదగ్ని, బిదా, భార్గవ 3, భార్గవ, చ్యవన, అప్నవాన3, జామదగ్ని, చ్యావన, అప్నవాన3, భార్గవ, చ్యావన, ఆప్నవానార్షిర్షేణ, అనూప5.
30. విదగోత్ర : భార్గవ, చ్యావన, అప్నవాన, ఔర్వ, బైద5, భార్గవ, ఔర్వ, జామదగ్ని 3, భార్గవ, చ్యావన, అప్నవాన 3
31. యస్కగోత్ర : భార్గవ, వైతహవ్య సావేతస 3
32. పార్థగోత్ర : భార్గవ, వైన్య, పార్థ 3
33. శ్వేగోత్ర : శ్వేత, వైన్య, పార్థ 3
34. వైన్య గోత్ర : వైన్య, భార్గవ, పార్థ 3
35. మిత్రయువగోత్ర : భార్గవ, వాధ్రేశ్వ, దైవోదాస 3
36. శునకగోత్ర : భార్గవ, శౌనహోత్ర, గాత్స్యమద 3, శౌనక, భార్గవ, గాత్సమద 3
37. శౌనకగోత్ర : శౌనక 1
38. గాత్సమదగోత్ర : భార్గవ, గాత్సమద 2
39. వత్సగోత్ర : భార్గవ, చ్యావన, అప్నవాన, ఔర్వ
40. పురోదసగోత్ర : భార్గవ, చ్యవన, ఆప్నవాన, వాత్స, పౌరోదస 5
41. శారరగోత్ర : భార్గవ, శారర, మారర 3
42. బైజవగోత్ర : భార్గవ, చ్యావన, ఆప్నవాన, బైజవ, మంథిత 5
43. గౌతమసగోత్ర : అంగీరస, ఆయాస్య, గౌతమ 3
44. ఔచత్యగౌతమగోత్ర : అంగీరస, ఔచత్య, గౌతమ 3, అంగీరస, ఔచత్య, ఔశిజ 3
45. రాహుగణగోత్ర : అంగీరస, రాహుగణ, గౌతమ 3
46. శారద్వతగోత్ర : అంగీరస, గౌతమ, శారద్వత 3
47. సోమరాజకగోత్ర : అంగీరస, సౌమరాజ్య, గౌతమ 3
48. వామదేవగోత్ర : అంగీరస, వామదేవ, గౌతమ 3, అంగీరస, వామదేవ, బార్హదుక్థ 3
49. కాక్షీవతగోత్ర : అంగీరస, ఔచిత్య, గౌతమ, ఔశిజ, కాక్షీవత 5
50. ఔశిజగౌతమగోత్ర : అంగీరస, ఔశిజగౌతమి 3
51. కౌమండగోత్ర : అంగీరస, ఔచిత్య, కాక్షీవత, గౌతమ, కౌమండ 5
52. దీర్ఘతమసగోత్ర : అంగీరస, ఔచిత్య, కాక్షీపత, గౌతమ, దైర్ఘతమస 5, అంగీరస, ఔచత్య దైర్ఘ తమస 3.
53. ఔశనసగోత్ర : అంగీరస, గౌతమ, ఔశనస 3
54. కరేణుపాలగోత్ర : అంగీరస, గైతమ, కరేణుపాల 3
55. రాఘువసగోత్ర : అంగీరస, రాఘువ, గౌతమ 3
56. రుక్షసగోత్ర : అంగీరస, బార్హస్పత్య, భారద్వాజ 3
57. భరద్వాజగోత్ర : అంగీరస, బార్హస్పత్య, భారద్వాజ 3
58. గార్గ్యగోత్ర : అంగీరస, బార్హస్పత్య, భారద్వాజ, గార్గ్య, శైన్య 5, అంగీరస శైన్యగార్గ్య 2
59. కపిగోత్ర : అంగీరస, అమహీయవ, ఔరుక్షయ 3
60. కాపిభువగోత్ర : అంగీరస, తైతిరీ, కాపీభువ 3
61. ఆత్మభువగోత్ర : అంగీరస, బార్హస్పత్య, భారద్వాజ, మాంత్రవర, ఆత్మభువ 5
62. శౌంగశౌశిరగోత్ర : అంగీరస, బార్హస్పత్య, భారద్వాజ, కాత, ఆత్కీల 5, అంగీరస, కాత్య, ఆత్కీల 3, ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ, శౌంగశైశిర 5
63. పృషదశ్వగోత్ర : అంగీరస, పాశదశ్వ, వైరూప్య 3
64. రథీతరగోత్ర : అంగీరస, వైరూప, పార్షదశ్వ 3, అంగీరస, పార్షదశ్వ, రథీతర 3
65. మౌద్గలగోత్ర : అంగీరస, భార్మ్యశ్వ, మౌద్గల్య 3, తార్క్ష్య, భార్మ్యశ్వ, మౌద్గల్య 3
66. సత్యముగ్ర్యగోత్ర : అంగీరస, భార్మ్యశ్వ, మౌద్గల్య 3
67. హంస జిహ్వాగోత్ర : అంగీరస, తావ్య, మౌద్గల్య 3
68. విష్ణువృద్ధసగోత్ర : అంగీరస, పౌరకుత్స, త్రాసదస్యవ 3
69. కుత్సగోత్ర : అంగీరస, అంబరీష, యువ్వనాశ్వ 3, మాంధాత్ర, అంబరీష, యౌవ్వనాశ్వ 3, అంగీరస, మాంధాత్ర, కౌత్స 3
70. కణ్వసగోత్ర : అంగీరస, అజమీఢ, కాణ్వ 3, అంగీరస, ఘౌర, కాణ్వ 3
71. సంకృతి గోత్ర : అంగీరస, సాంకృత్య, గౌరువీత 3, శాక్త్య, గౌరువీత, సాంకృత్య 3
72. అత్రేయసగోత్ర : ఆత్రేయ, అర్చనాసన, శ్యావస్వ 3
73. గావిష్టిరగోత్ర : ఆత్రేయ, గావిష్టిర, పౌర్వతిథ 3 ఆత్రేయ, అర్చనాసన, గావిష్టిర 3.
74. ముద్గలసగోత్ర : అత్రేయ, అర్చనాసన, పౌర్వతిథ 3
75. అతిథి గోత్ర : ఆత్రేయ, అర్చనాసస, అతిథ 3
76. వాక్యూతసగోత్ర : ఆత్రేయ, అర్చనానస, వాక్చుత 3
77. పాత్రికగోత్ర : ఆత్రేయ, వామరత్య,పాత్రిక 3
78. సుమంగలస గోత్ర : ఆత్రేయ, సౌమంగల, శ్యావశ్వ 3
79. అగస్త్య గోత్ర : అగస్త్య, ధార్డ్యచ్యుత, ఐద్మవాహ 3, అగస్తత్య, దార్డ్యచ్యుత, సోమవాహ 3
80. సాంబవాహగోత్ర : అగస్త్య, ధార్డ్యచ్యుత, సాంబవాహ 3
81. యజ్ఞవాహగోత్ర : అగస్త్య, దార్డ్యచ్యుత, యజ్ఞవాహ 3
82. మయోభువగోత్ర : అగస్త్య, పౌర్ణమాస, పౌరణ 3
83. పౌరణగోత్ర : అగస్త్య, పౌర్ణమాస, పౌరణ 3
84. శాక్రగోత్ర : అగస్త్య, హైమవర్చ, హమోదక 3
85. పౌరూరవగోత్ర : మానవ, ఏల, పౌరూరవస 3
86. మౌంగలగోత్ర : బాలందన, వాత్సప్రీ, మౌంగల 3
87. వాత్సప్రీగోత్ర : వాత్సప్రీ 1
88. మానవగోత్ర : మానవ 1
89. కౌశిక : విశ్వామిత్రాఘమర్షణకౌశికేతి 3
90. కుత్స : అంగీరసమాంధాత్రకౌత్సేతి 3
91. అత్రి : ఆత్రేయార్చనాసశ్యావాశ్వేతి 3
92. అంగీరస : అంగీరసాంబరీషయౌవనాశ్వేతి 3
93. వాసిష్ఠ : కౌండిన్య మైత్రావరుణవాసిష్ఠేతి 3, వాసిష్ఠేంద్ర ప్రమదాభరద్వస్త్యేతి 3, వాసిష్ఠాభరద్వస్త్యేంద్ర ప్రమాదేతి 3 వాసిష్ఠేంద్ర ప్రమదాభరద్వసోఇతి 3
94. గార్గ్య : అంగీరశైన్యగార్గ్యేతి 3
95. పార్థివ : భార్గవైన్యపార్థేతి3, విశ్వామిత్రమాధుశ్చందసదానంజయేతి 3
96. బాదరాయణ : అంగీరస పౌరుకుత్సాత్రాస దస్యేతి 3
97. భార్గవ : భార్గవశ్యవన్యావానేతి 3
98. ముద్గల : అంగీరసభార్మ్యశ్వమౌద్గల్యేతి 3
99. లోహితాక్ష : విశ్వామిత్రాఘమర్షణకౌశికేతి 3
100. లోహితస : విశ్వామిత్రదేవరాతచికిత 3
101. శాలాక్ష : విశ్వామిత్రాశాలంకాయనకౌశికేతి 3
102. నిత్యుందన : అంగీరసపౌరుకుత్సత్రాసదస్యేతి 3

## తెలుగు సంవత్సరములు మరియు మూలశకములు

| క్రమ | సం॥ పేరు | శాలిశక | సం॥ | క్రమ | సం॥ పేరు | శాలిశక | సం॥ |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ప్రభవ | ౧౮౪౯ | 1927-28 | 31. | హేమళంబి | ౧౮౭౯ | 1957-58 |
| 2. | విభవ | ౧౮౫౦ | 1928-29 | 32. | విళంబి | ౧౮౮౦ | 1958-59 |
| 3. | శుక్ల | ౧౮౫౧ | 1929-30 | 33. | వికారి | ౧౮౮౧ | 1959-60 |
| 4. | ప్రమోదూత | ౧౮౫౨ | 1930-31 | 34. | శార్వరి | ౧౮౮౨ | 1960-61 |
| 5. | ప్రజోత్పత్తి | ౧౮౫౩ | 1931-32 | 35. | ప్లవ | ౧౮౮౩ | 1961-62 |
| 6. | అంగీరస | ౧౮౫౪ | 1932-33 | 36. | శుభకృతు | ౧౮౮౪ | 1962-63 |
| 7. | శ్రీముఖ | ౧౮౫౫ | 1933-34 | 37. | శోభకృతు | ౧౮౮౫ | 1963-64 |
| 8. | భవ | ౧౮౫౬ | 1934-35 | 38. | క్రోధి | ౧౮౮౬ | 1964-65 |
| 9. | యువ | ౧౮౫౭ | 1935-36 | 39. | విశ్వావసు | ౧౮౮౭ | 1965-66 |
| 10. | ధాత | ౧౮౫౮ | 1936-37 | 40. | పరాభవ | ౧౮౮౮ | 1966-67 |
| 11. | ఈశ్వర | ౧౮౫౯ | 1937-38 | 41. | ప్లవంగ | ౧౮౮౯ | 1967-68 |
| 12. | బాహుధాన్య | ౧౮౬౦ | 1938-39 | 42. | కీలక | ౧౮౯౦ | 1968-69 |
| 13. | ప్రమాథి | ౧౮౬౧ | 1939-40 | 43. | సౌమ్య | ౧౮౯౧ | 1969-70 |
| 14. | విక్రమ | ౧౮౬౨ | 1940-41 | 44. | సాధారణ | ౧౮౯౨ | 1970-71 |
| 15. | వృష | ౧౮౬౩ | 1941-42 | 45. | విరోధికృత్ | ౧౮౯౩ | 1971-72 |
| 16. | చిత్రభాను | ౧౮౬౪ | 1942-43 | 46. | పరీధావి | ౧౮౯౪ | 1972-73 |
| 17. | స్వభాను | ౧౮౬౫ | 1943-44 | 47. | ప్రమాదీచ | ౧౮౯౫ | 1973-74 |
| 18. | తారణ | ౧౮౬౬ | 1944-45 | 48. | అనంద | ౧౮౯౬ | 1974-75 |
| 19. | పార్థివ | ౧౮౬౭ | 1945-46 | 49. | రాక్షస | ౧౮౯౭ | 1975-76 |
| 20. | వ్యయ | ౧౮౬౮ | 1946-47 | 50. | నల | ౧౮౯౮ | 1976-77 |
| 21. | సర్వజిత్ | ౧౮౬౯ | 1947-48 | 51. | పింగళ | ౧౮౯౯ | 1977-78 |
| 22. | సర్వధారి | ౧౮౭౦ | 1948-49 | 52. | కాళయుక్తి | ౧౯౦౦ | 1978-79 |
| 23. | విరోధి | ౧౮౭౧ | 1949-50 | 53. | సిద్ధార్థ | ౧౯౦౧ | 1979-80 |
| 24. | వికృతి | ౧౮౭౨ | 1950-51 | 54. | రౌద్రి | ౧౯౦౨ | 1980-81 |
| 25. | ఖర | ౧౮౭౩ | 1951-52 | 55. | దుర్మతి | ౧౯౦౩ | 1981-82 |
| 26. | నందన | ౧౮౭౪ | 1952-53 | 56. | దుందుభి | ౧౯౦౪ | 1982-83 |
| 27. | విజయ | ౧౮౭౫ | 1953-54 | 57. | రుధిరోద్గారి | ౧౯౦౫ | 1983-84 |
| 28. | జయ | ౧౮౭౬ | 1954-55 | 58. | రక్తాక్షి | ౧౯౦౬ | 1984-85 |
| 29. | మన్మథ | ౧౮౭౭ | 1955-56 | 59. | క్రోధన | ౧౯౦౭ | 1985-86 |
| 30. | దుర్ముఖి | ౧౮౭౮ | 1956-57 | 60. | అక్షయ | ౧౯౦౮ | 1986-87 |

## ద్విత్వాక్షర వివరములు

ఈ పేర్లు గలవారికి ఎదురుగా చూపిన నక్షత్రములు రాసులగును (బ్రహ్మయామిళ గ్రంథాధారముగా)

| | | |
|---|---|---|
| ప్లవన్, ప్రహ్లాద, హ్లాదిని, క్లేశ, లౌకిక | అశ్విని 4 పాదం | మేషరాశి |
| ఐంద్ర | కృత్తి 1 పాదం | మేషరాశి |
| పృథ, తృణ, నృపతి | కృత్తికా 3 పాదం | వృషభరాశి |
| వృష, స్వప్న, స్వాతి | రోహిణి 2 పాదం | వృషభరాశి |
| శ్వేత, వైకుంఠ | మృగశిర 1 పాదం | వృషభరాశి |
| కృష్ణ, కృప, క్రాంతి | మృగశిర 3 పాం | మిథునరాశి |
| జ్ఞాన | ఆర్ద్ర 3 పాదం | మిధునరాశి |
| ద్రోణ, ద్రౌపది | స్వాతి 3 పాదం | తులారాశి |
| త్రివిక్రమ్, త్రయంబక్, తౌర్యః | స్వాతి 4 పాదం | తులారాశి |
| స్నుష | అనూరాధ 3 పాదం | వృశ్చికరాశి |
| స్నేహ | అనూరాధ 4 పాదం | వృశ్కిరాశి |
| శ్లామల, చ్యవన, చ్యుతి | జ్యేష్ట 2 పాదం | వృశ్చికరాశి |
| జ్యోతి | మూల 2 పాదం | ధనురాశి |
| భీముడు | మూల 4 పాదం | ధనురాశి |
| ధూర్జలి, ధ్వజ, ధ్యాస, ధృవ | పూర్వాషాఢ 2 పాదం | ధనురాశి |
| కైలాసం, కైక, కైంకరి | పునర్వసు 1 పాదం | మిథునరాశి |
| మృగ, మృడ | మాఘా 1 పాదం | సింహరాశి |
| ఫణి, పౌడి, పౌరోహిత్ర | ఉత్తరా 3 పాదం | కన్యారాశి |
| క్షేమ, క్షేత్రపాల | హస్త 2 పాదం | కన్యారాశి |
| ప్రభాకరు, బ్రహ్మ, బ్రామరి, భ్రమరాంబ, ప్రణీత | చిత్తా 3 పాదం | తులారాశి |
| ప్రేష, ప్రేమ, స్రవంతి, శ్రావణ్ | చిత్తా 3 పాదం | తులారాశి |
| శ్రీనివాస్, శ్రీకాంత్ | చిత్తా 4 పాదం | తులారాశి |
| సృజన్, హృష్ణః | స్వాతి 1 పాదం | తులారాశి |
| భారతి, భైరవుడు | పూర్వాషాఢ 3 పాదం | ధనురాశి |
| గౌతమ, గౌరి | శతభిష 2 పాదం | కుంభరాశి |
| దైవజ్ఞ, ద్రాక్ష, ద్విజ, ద్యుతి | పూర్వాభాద్ర 3 పాదం | కుంభరాశి |
| శివ, శోభ, శైలజ | ఉత్తరాభాద్ర 2 పాదం | మీనరాశి |
| చైతన్య, చైడయ్య | రేవతి 3 పాదం | మీనరాశి |

## వివాహము అర్థం - పరమార్థం

"వివాహం" అనగానే గుర్తుకొచ్చేది బోలెడంత ఖర్చు. దానివల్ల శాస్త్రీయంగా జరిగే పెళ్ళి అంటే ఖర్చుతో కూడుకున్నదనే భావిస్తున్నారు. కానీ శాస్త్రీయ వివాహానికి , విపరీతపు ఖర్చుకీ సంబంధం లేదు. పెళ్ళి అనే యజ్ఞంలో ప్రత్యంశం ఎంతో లోతైనది. సంస్కారంతో కూడుకున్నది. అర్థవంతమైనది. వివాహము జరపడానికి ఏ వ్యక్తి అప్పుల ఊబిలో మునిగిపోనక్కర్లేదు.

మనిషి ఏమిటి సాధించాలి ? అన్న ప్రశ్నకి స్పష్టమైన సమాధానం చెప్తోంది మన సంస్కృతి. సాధించాల్సినవి అంటే అర్థాలు (ప్రయోజనాలు)

**1. ధర్మం 2. అర్థం 3. కామం 4. మోక్షం వీటినే పురుషార్థాలు అన్నారు.**

ఇందులో మొదటి మూడు సామాజిక మైనవి. నాల్గవది (మోక్షం) వ్యక్తిగతం. అయితే మొదటి మూడు లేనప్పుడు నాలుగవది (ప్రవృత్తి మార్గంలో వున్నవారికి అసాధ్యం. అందులో చివరి మూడింటికి ప్రధానమైన పునాది "ధర్మం" ఇది మార్గగామికైనా అత్యవసరం.

"ధర్మం" లేని అర్థ, కామసంపాదన మహాపాపం. దోషం, అమానుషత్వం. అదే దానవత్వం. కనుక మానవత్వానికి ధర్మం ప్రధానం.

సత్యం, అహింస, శౌచం (అంతరంగ బహిరంగ శుద్ధి) అస్తేయం (అక్రమార్జితం కానిది) అనే నాలుగు ప్రధానాంగాలు కలది ధర్మం. ధర్మం మనిషిని సంస్కారవంతుడ్ని చేస్తుంది. దేని వలన మనం సంస్కరించబడుతున్నామో అదే సంస్కృతి. "వివాహం" ఒక సంస్కృతి.

వివాహం అనేది స్త్రీ పురుషుల దైహిక వాంఛలు తీర్చుకోవడానికి పనికొచ్చే సామాజిక అంగీకారం (లైసెన్స్) ఇతర నాగరికతల భావం కావచ్చేమోకాని, మన సంస్కృతి భావం అది కాదు.

మనిషికి జన్మగతంగా వున్న బాధ్యతల్ని సక్రమంగా నిర్వహించడానికి అత్యవసరమైనది. గృహస్థాశ్రమం పవిత్రమైన ఆ ఆశ్రమస్వీకరమే వివాహ సంస్కారం.

యజ్ఞాలకోసమే వివాహం.

ప్రతి వ్యక్తి చేయాల్సినవి ఐదు యజ్ఞాలు వున్నాయి. 1. దేవ యజ్ఞం 2. పితృ యజ్ఞం 3. ఋషి యజ్ఞం 4. మనుష్య యజ్ఞం 5. భూత యజ్ఞం

సూర్యుడు, చంద్రుడు, భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే మహాశక్తులు దైవస్వరూపాలే మనం అర్థించకుండానే అనుగ్రహించే ఈ దివ్యశక్తులు చలనశక్తిదైవమే. ఆ దైవ ఋణాన్ని తీర్చుకొనేందుకు నిర్వహించే దూప సంబంధకార్యాలు (నిత్యనైవేద్య కర్మలు, వ్రతాదులు) "దూప యజ్ఞము".

మన జన్మకి కారణమైన తల్లిదండ్రుల, పూర్వీకుల ఋణం తీర్చుకోవాలి. జీవించి వున్నంత కాలం వారిని సేవించడం, అనంతరం తర్పణాది క్రియలను, ఆచరించడం, పితృయజ్ఞం, వంశాన్ని కొనసాగించి తద్వార కుటుంబ వ్యవస్థని నిలిపి పితరుల్ని తరింపజేయడమే పితృ యజ్ఞం. ఆ యజ్ఞం వివాహం వల్లనే సాధ్యం. అందుకే వివాహం జరుగుతుంటే వధూవరుల పితురులు ఎంతో ఆనందిస్తారని శాస్త్రాలు చెప్తున్నాయి.

ఋషులు చెప్పిన దివ్యవాక్యాలను తెలుసుకొని అనుసరించడమే ఋషి యజ్ఞం.

యోగ్యులైన ప్రజలు సమాజానికి అవసరం. ఆ ప్రజలు వివాహం ద్వారా ఉత్పన్నమయిన వారే. కనుక జీవకోటివృద్ధికి ఉన్నతికి వివాహం ఒక నాంది.

సాటి మనిషికి సహకరించడం అనేది గృహస్థాశ్రమ కర్తవ్యం అదే విధంగా ప్రాణికోటిని ఆదుకోవడం కూడా బాధ్యత. ఈ రెండు మనుష్య యజ్ఞం, భూత యజ్ఞం అని చెప్పబడుతాయి.

ఆరోగ్యవంతమైన సమాజానికి జీవనాడి అయిన కుటుంబ వ్యవస్థకి శ్రీకారం వివాహమే.

### శాస్త్రీయ వివాహానికి పెద్ద ఖర్చు ఉండదు.

"వివాహం" అనగానే గుర్తుకొచ్చేది బోలెడంత ఖర్చు దాని వల్ల శాస్త్రీయంగా జరిగే పెళ్ళి అంటే ఖర్చుతో కూడుకున్నదనే భావిస్తున్నారు. కాని శాస్త్రీయ వివాహానికి, విపరీతపు ఖర్చుకీ సంబంధం లేదు. అంతా యథాశక్తి (శక్తి కొలది) అనే శాస్త్రం చెప్తోంది. శాస్త్రీయంగా అంటే పెళ్ళితంతులో ప్రతిఘట్టం పట్ల అవహన కలిగి ఆచరించడమే.

వివాహం అనే యజ్ఞంలో ప్రత్యంశం ఎంతో లోతైనది. సంస్కారంతో కూడుకున్నది. అర్థవంతమైనది. ఇది జరపడానికి ఏ వ్యక్తి అప్పుల ఊబిలో మునిగి పోనక్కర్లేదు.

విపరీతంగా ఖర్చు పెట్టి పెళ్ళి చేయడమనేది ఒక ఆర్భాటం లేదా ఒక ముచ్చట, ఒక వేడుక, వేడుక కోసం చేయడం అనేది అభిరుచి, ఆసక్తుల మీద ఆధారపడి వుంటుంది. కానీ దానిక శాస్త్రంతో పనిలేదు.

**నిజానికి, భారతీయ సంస్కృతికి ప్రధాన సూత్రం నిరాడంబరత అని గమనించాలి.** ఆడంబరంగా నిర్వహించే వివాహంలో అతి ముఖ్యమైన దూరదృష్టి పోయి శాస్త్రానికి కూడా

విఘాతం కలగడం విచారకరం.

అయితే సువర్ణం. వస్త్రాదులు ఎవరితాహతును బట్టి వారు వివాహపద్ధతిలో వాడాల్సిందే. అక్కడ అవి దివ్యమైన యజ్ఞద్రవ్యాలే అవి ఆయుష్షును వర్చస్సును పెంచుతాయి. కన్య కనక సంపన్నయై విష్ణ భగవానునితో సమానుడైన వరుని స్వంతమౌతుంది. ఆ కనకాలు ఆమెకు సంపదలె అది కన్యాదాత శక్త్యానుసారం వుండాలి.

అంతేగాని కట్నాలు-బేరసారాలు శాస్త్రీయ వివాహంలో లేవు. కన్యాశుల్కాలు, వరకట్నాలు 'అసలీ' వివాహం కిందికి వస్తాయని బాధించి సాధించే డబ్బుతో పెళ్ళి చేసుకోవడం దోషమని వివాహ శాస్త్రం సుస్పష్టంగా నిర్దేశిస్తోంది.

అసలు శాస్త్రీయంగా పెళ్ళి జరగడమంటే మనిషి సంస్కారవంతంగా గృహస్థాశ్రమాన్ని స్వీకరించడం. ఈ విషయాలు పెళ్ళి ఘట్టాన్ని గమనిస్తే తెలుస్తాయి. ముఖ్యంగా వధూవరులు గమనించాలి.

ప్రతి మంత్రానికి అర్థం తెలియకపోయినా, ఆ ఘట్టంలో భావం అర్థమైతే చాలు మంత్రానికి అర్థం తెలిసినా తెలియక పోయినా దాని ప్రభావం పోదు శబ్ద బ్రహ్మస్వరూపములైన వేదమంత్రాలు ఋషుల తపోదృష్టికి గోచరించబడినవి. గనుక మహిమాన్వితాలు, ఆ పావన మంత్రాల భావాన్ని సూక్ష్మంగా గ్రహిస్తే పెళ్ళిలో వున్న పవిత్రత లోతైన భావం విశాలమైన శుభములు గోచరమౌతాయి.

**వివాహంలో జరిగే ఘట్టాలేమిటి ? వాటి వెనుక వున్న పరమార్థం ఏమిటి ? క్లుప్తంగా తెలుసుకోవడం అవసరం.**

వివాహం అంటే 1. ఒక సంస్కారం 2. పెద్దల ముందు తీసుకునే ప్రతిజ్ఞ 3. దేవ, పితృఋషి ఋణాలు తీర్చుకొనేందుకు అవకాశం, 4. సార్థక సంస్కార జీవితంలో ధర్మమయమైన అర్థకామ సంపాదనతో తననీ, సమాజాన్ని క్షేమంగా, సజావుగా నిర్వహింప జేసుకోవడానికి అవసరయ్యే ఋషి మార్గం, 5. జీవిత యజ్ఞాన్ని గృహస్థాశ్రమ సహకారంతో నిర్వహించాలి. అందుకే ఈ గృహ రాజరాణులుగా గృహ సామ్రాజ్యాధికారం పెంపొందేందుకు చేసే పట్టాభిషేకం పెళ్ళి.

వివాహంలోని ప్రతి కర్మకలాపాన్ని శ్రద్ధాభక్తులతో ఆచరిస్తే, మంత్రాల్లో చెప్పబడ్డ దేవతాశక్తులు, దివ్య భావనలు ప్రేమతో గమనిస్తాయి. ప్రీతితో రక్షిస్తాయి.

పెళ్ళి ఖర్చుల ఆడంబరాలు, అర్థంలేని చెవులు పగిలే వాద్యాలువంటివి పెళ్ళికి అనవసరం (మంగళ వాద్యాలు మాత్రం ముఖ్యం).

**"అనవసరపు ఖర్చు తగ్గించి, శాస్త్రానికి భంగం కలగకుండా వివాహ యజ్ఞాన్ని జరుపుకోండని** "కంచి మహాస్వామి శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారు చెప్పిన విలువైన మాటల్ని సదా జ్ఞప్తిలో వుంచుకోవాలి.

**వివాహమునకు పూర్వ రంగం నిశ్చితార్థం**

వధూవరులు నిర్ణయమయ్యాక, కొన్ని నెలలు, లేదా రోజుల ముందు పెళ్ళి నిశ్చయంగా జరుగుతుంది అని పెద్దలు చెప్పుకొనే పెళ్ళి మాటలే "నిశ్చితార్థం" అంటారు. ఇది వివాహ శాస్త్రంలో ప్రస్తావించలేదు. మన పూర్వులు మాటకిచ్చిన విలువలోనిది ఈ భాగం. మాట యిచ్చి పుచ్చుకోవడానికి సంప్రదాయకంగా ఈతాంబూలాలు ఇచ్చి పుచ్చుకోవడం ఆచారం. "మీ అమ్మాయిని మా అబ్బాయికి చేసుకుంటాం" అని ఇరువైపు పెద్దలు పురోహితుని సమక్షంలో పసుపు కుంకాలు, తాంబూలాలు యిచ్చి పుచ్చుకుంటారు. ఇదే 'నిశ్చితార్థం'. శుభకార్యం గురించి ప్రస్తావన, మంచి రోజున ఈ మాటలు జరగడం, నిర్విఘ్నం కోసం గణపతి పూజ చేస్తారు. ఇది శాస్త్రత్వమేమీ కాదు. మాట యిచ్చి పుచ్చుకొనేటప్పుడు సత్ సంకల్పంతో చేసే పని కనుక శాస్త్ర సమ్మతమే.

నిశ్చితార్థం లేకున్నా వివాహం జరిపించవచ్చు. వివాహంలో వచ్చే 'కన్యాదానం' లాంటి కొన్ని ముఖ్యమైన ఘట్టాలు చాలు వేరే 'నిశ్చితార్థం' లేక పోయినా శాస్త్రానికేమీ భంగం కాదు.

అయితే ఈ నిశ్చియతాంబూలాలు, అనేవి రానురానూ ఎన్నో కొత్తపోకడలు పోతున్నాయి. వివాహితులు కాని వధూవరులచేత ఉంగరాలు, దండలు మార్పించడం. ఒకే ఆసనంపై కూర్చోవడం వంటివి కూడా నిశ్చితార్థం నాడు జరుగున్నాయి. ఇవన్నీ శాస్త్ర విరుద్ధాలు.

వివాహానికి ముందు అబ్బాయిని పెళ్ళి కొడుకుని చేయడం, అమ్మాయిని పెళ్ళి కూతురుని చెయ్యడం ఆచారం అంటే వివాహదీక్షకు వారిని సన్నద్ధుల్ని చేయడమన్నమాట.

వివాహ పూర్వరంగం బ్రహ్మచర్యం వరునికి సంబంధించినది. బ్రహ్మచర్యవ్రతం తరువాతది గృహస్థాశ్రమం. బ్రహ్మచర్యం విద్యార్జనకోసం వినియోగించబడింది. అలవర్చుకున్న విద్యని జీవితంలో అమలు పరచేందుకు గృహస్థాశ్రమం.

### స్నాతకం

వరుడు బ్రహ్మచర్యదీక్షను విరమిస్తున్న సూచనగా కేశ ఖండనం చేయడాన్ని 'గోదానవ్రతం' అంటారు. ఆ తరువాత స్నాతకం గృహస్థాశ్రమంలోనికి వేళ్లే ముందు, గురువు బ్రహ్మచారికి

ఉపదేశించే వాక్యాలలో (మంత్రాలలో) ముఖ్యమైనవి.

"సత్యం వద ధర్మం చర, స్వాధ్యాయాన్ మాప్రమదః, ప్రజాతంతు మావ్యవచ్ఛేత్సీః

సత్యాన్న ప్రమదితవ్యం, ధర్మాన్న ప్రమదితవ్యం, కుశలాన్న ప్రమదితవ్యం

భూత్యైన ప్రమదితవ్యం, సాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం

మాతృ దేవోభవ-పితృ దేవో భవ, ఆచార్య దేవోభవ - అతిథి దేవోభవ

యాన్యన వద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి... " (తైత్తీరీయోపనిషత్తులోని మంత్రాలు) "సత్యాన్ని మాట్లాడే ధర్మాన్ని అనుష్టించే అధ్యయన విషయంలో అశ్రద్ధ చేయకు. సంతతి దారాన్ని తెంచకు (అంటే వంశాభివృద్ధి చేయు).

సత్యంలో, ధర్మంలో, నేర్పరితనంలో అభ్యుదయ మార్గంలో, అధ్యనంలో, పఠనంలో పొరబడవద్దు.

దైవపితృకార్యాలలో పొరపాటు చేయకు. తల్లి దైవమని తెలుసుకో, తండ్రి దైవమని తెలుసుకో, గురువు దైవమని తెలుసుకో, అతిథి దైవమని తెలుసుకో.

నిందలేని పనులు అని ఏవి ప్రసిద్ధాలో వాటినే ఆచరించు తక్కిన వాటిని ఆచరించవద్దు.

యోగ్యులైన వారికి దానం చేయి. నిర్లక్ష్యం వద్దు. మనం చేసేది గొప్ప కాదని చక్కని జ్ఞానంతో (దైవాన్ని ఉద్దేశించి) దానం చేయాలి. (శ్రద్ధయాదేయం, అశ్రద్ధయా దేయం, శ్రియాదాదేయం, హ్రియాదేయం, భియా దేయం, సంవిదాదేయం)

ఈ మహా వాక్యాలకు మించిన ఉపదేశం మరొకటి లేదు. జీవన సార్థక సూత్రాలివి.

ఈ ఉపదేశాలలోనే మనజీవితం ఎందుకో, గృహస్థాశ్రమం ఎందుకో స్పష్టమౌతుంది.

ఈ ఘట్టాన్నే స్నాతకం అంటారు. **విద్యానంతరం ప్రాపంచిక జీవితం నిర్వహణకు అప్రమత్తుడ్ని చేస్తూ ధర్మాన్ని ఉపదేశించేదే స్నాతకోత్సవం.**

"నీ వరకు వచ్చిన సంతాన లతను తెంచి వేయకుండా, నీ పితరుల ఋణాన్ని తీర్చుకోవడానికి మంచి సంతానాన్ని పొందాలి. అందుకే గృహస్థాశ్రమాన్ని స్వీకరించు" అనోదివ్యమైన ఆచార్య వచనాన్ని అనుసరించడమే వివాహం.

**కాశీ యాత్ర**

స్నాతకం తర్వాత జరిగే కార్యక్రమం 'సమావర్తనం' తరువాత కాశీయాత్రకు కన్యసోదరుడుగానీ లాంఛనంగా ఆదరించి ఆహ్వానిస్తాడు.

"మా కన్యను మీకిచ్చి వివాహం చేస్తాం. అగ్నిసాక్షిగా పాణీ గ్రహణం చేయండి. దయతో మా ఇంటికి రండి అని ఆహ్వానం.

ఇదంతా వివాహానికి పూర్వరంగం దీనినే మనవాళ్లు మొత్తంగా 'స్నాతకం' పేరుతో పిలుస్తారు.

**ఆ తరువాత వివాహఘట్టం.** కళ్యాణం చూదము రారండి.

**వరాగమనం**

వివాహ ఘట్టంలో మొదటిది వరాగమనం. వరుడు బంధు మిత్రులతో, మంగళగీత వాద్యాలతో శుభశకునాలతో కన్యాదాత యిచ్చిన విడిదికి తరలి వెళ్ళడమే వరాగమనం.

**కాన్యావరణం**

వివాహదీక్షను స్వీకరించడమే కన్యావరణం.

యోగ్యులైన పెద్దలను తనకు మంచి కన్యను నిర్ణయించవలసిందిగా కోరుతాడు వరుడు. పెళ్ళి కుమార్తె సర్వలక్షణ సంపన్నమైనదని పెద్దలు నిర్ణయించి వరునకు తగినదని తీర్మానిస్తారు. వివాహం ప్రీతి కార్యం గనుక - శ్రీ మహా విష్ణు ప్రీత్యర్థం కన్యాపాణి గ్రహణం కరిష్యే శ్రీ మహావిష్ణువు ప్రీతికై కన్యను స్వీకరిస్తున్నాను. అంటాడు వరుడు. ఇదే కన్యావరణం.

**మంగళ స్నానాలు**

మొదటిగా వధువు మంగళ స్నానం చేయాలి. తరువాత వరునికి మంగళస్నానం. మంగళ స్నానం ఉద్దేశ్యం అంతరంగ, బహిరంగ శుద్ధి అదే శౌచం. వివాహమే యజ్ఞానికి అవసరమైన శౌచం. మంగళ స్నానం వల్ల సిద్ధిస్తుంది.

మంగళ స్నానం తరువాత వరుడు విఘ్నేశ్వర పూజ చేస్తాడు. తరువాత పుణ్యాహవాచనం, సంకల్పం...

**గౌరీపూజ**

వధువు గౌరీదేవి అనుగ్రహం కోసం గౌరీ పూజ చేస్తుంది. పరిపూర్ణత్వానికి ప్రతీకగా కొబ్బరి బొండాం. అయదవ తనం యిచ్చే పసుపు కుంకుమలు వంటి మంగళ ద్రవ్యాలు గౌరీ పూజలో వాడతారు.

గౌరీదేవి పెద్దముత్తయిదవ మృత్యుంజయునికి సహచారిణి అయినా తల్లి కరుణవల్ల అయిదవ తనం కలుగుతుంది. రుక్మిణిదేవి శ్రీకృష్ణుని వివాహమాడే ముందు గౌరీదేవిని పూజించిందని భాగవతకథ" నమ్మితి నా మనమ్మున సనాతులైన ఉమామహేశులున్, మిమ్ము పురాణదంపతుల ... నిను నమ్మినవారి నెన్నటకి దంపతులైన పార్వతీ పరమేశ్వరులను పూజించింది.

### గోత్రాలు చెప్పడం

వరుని గోత్ర నామాదులు, పూర్వీకుల వివరాలు కన్యాదాత సమక్షంలో వివరించబడతాయి. ఇందులో వరుని యొక్క పూర్వీకులనుస్మరించి ఆ వంశానికి చెందిన బ్రహ్మచారిని, "ధర్మవృద్ధి కొరకు, సంతాన సంపదకొరకు వరునిగా ఎన్నుకొంటున్నాం" అని పెళ్ళి కూతురి తండ్రి (కన్యాదాత) ద్వారా మంత్రం చెప్పిస్తారు.

తరువాత వరుడు - 'శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ధర్మ ప్రజాసంపత్యర్థంస్త్రియం ఉద్వహే'-' శ్రీ పరమేశ్వరుని ప్రీతికోసమై - ధర్మవృద్ధికై, సంతాన సంపదకై కన్యను వివాహం చేసుకుంటున్నాను' - అని చెప్తాడు.

### మహా సంకల్పం

ఏ శుభకార్యం చేసినా స్థలం, కాలం చెప్పి, ఆచమ్యం...కరిష్యే (చేస్తున్నాను) అని సంకల్పం చెప్తారు. అయితే వాహహం అనేది జీవితంలోనే ముఖ్య సంస్కారం కనుక, పిల్లనిచ్చే వ్యక్తివెనుక పదితరాలు, ముందు పది తరాలు కన్యాదాన సత్ఫలితాలు అనుభవిస్తారు. కనుక యిక్కడి సంకల్పం చాలా విశేషంగా విశిష్టంగా వుంటుంది.

ఈ మహాసంకల్పం విశ్వరూపాన్ని వివరిస్తుంది. విశ్వవ్యాప్తమైన మహాదివ్య శక్తి స్మరించడమే ఈ సంకల్ప మంత్రాల ప్రధానోద్దేశ్యము. భగవంతుడు విశ్వరూపుడు కనుకనే ఆయన పేరు విష్ణువు విష్ణు సహస్రంలో మొదటి నామం 'విశ్వం'.

ఈ మహా సంకల్పంలో భుగోళ స్థితిని వివరించే మంత్రాలున్నాయి. ఈ సమస్త విశ్వంలో భూమి యొక్క స్థానం, దానిని పాలించిన మహారాజులు, షట్చక్రవర్తులు, భూమిపై వున్న అనేక దేశాలు, పుణ్యతీర్థాలు, క్షేత్రాలు, నదులు, ద్వీపాలు, ఖండాలు, దశారణ్యాలు ఇత్యాదులన్నీ ప్రస్తావించడం.

అనంతమైన కాలంలో, ప్రస్తుత శ్వేతవరాహకల్పంలో, వైవస్వత మన్వంతరంలో, కలియుగ ప్రథమ పాదంలోని, ప్రస్తుత సంవత్సరం, ప్రస్తుత ఋతువు, మాసం, పక్షం, వారం తిథో, నక్షత్రం యోగం, కరణం చెప్పబడి 'ఈ రోజున, ఫలానా పేరుగల నేను, నారాయణ ప్రీతి కొరకు కన్యాదానం చేస్తున్నాను.' అన్నది కన్యాదాత మహాసంకల్పం (శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం సాలంకృత సహిరణ్యదక కన్యాదాన మహం కర్ష్యే).

**ఇంత విశ్వంలో తానెంతో తలచుకుంటే అహంకారం దూరమై, కర్తవ్య పరాయణత్వం, ధర్మానికి కట్టుబడేవినయ విధేయతలు సంప్రాప్తిస్తాయి.**

### కాళ్ళు కడిగి కన్యాదానం

విష్ణు ప్రీతి కొరకై చేయబడిన ఆ కన్యాదానం ద్వారా 'మయాసహ, దశపూర్వేషాం దశాపరేషాంమద్వంశానాం పిత్ర్యాణాం శాశ్వత బ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం - **నాతో పాటు వెనుక పది తరాలు, ముందు పదితరాలు శాశ్వత బ్రహ్మలోకాన్ని పొందేందుకై కన్యాదానం చేస్తున్నాను'** అని మామగారి మాట.

ఆ తరువాత వరుని పూజిస్తారు.

విశ్వరూపుడైన విష్ణువునే వరుడిగా భావిస్తాడు. కన్యాదాత కనుకనే ఆ వరునిరూపంలో వున్న విష్ణువుని పూజించి కాళ్ళు కడుగుతాడు.

**గృహం అనేది విశ్వంలో ఒక అంశం ఈ గృహంలో మరో విశ్వం వుంది. తల్లి, తండ్రి, సంతానం పెరుగుదల వ్యవహారమంతా వుంది. మహావిశ్వంలో ఇల్లు ఒక భాగం.**

విశ్వంలో వున్న మహాశక్తి గృహానికి వుంటుంది. కనుక గృహస్తు కూడా విశ్వపతి యొక్క అంశ రూపమే. దానిని గుర్తు చేస్తూ గృహస్థు కాబోయే వరుని విష్ణువుగా భావించి పూజించడమే ఇందులో అంతరార్థం.

కన్యాదాత, అతని భార్య అల్లునికాళ్ళుకడిగి కన్యాదానం చేస్తారు. ప్రతి కర్మలోనూ ఆధ్యాత్మికత ప్రకాశించడమే భారతీయ సంస్కృతి.

కన్యాదాత పెళ్ళి కొడుకు కాళ్ళు కడిగేటప్పుడు ముందు కుడిపాదం, తరువాత ఎడమపాదం కడిగి ఆ తర్వాత రెండు పాదాలు కలిపికడిగి -

"కన్యాం కనకసంపన్నాం కనకాభరణైర్యుతామ్, దాస్యామి విష్ణవేతుభ్యం..."

దాస్యామి విష్ణవేతుభ్యం..." అని కన్యాదానం చేస్తాడు.

### నాతిచరామి

కన్యాదాత 'వృణీధ్వం' (వరించవలసినది) అని అంటాడు. వరుడు - 'వృణీమహే' (వరిస్తున్నాను) అంటాడు. ఇంకా ఇక్కడ వరుడు చెప్పే మంత్రాలలో ప్రధానంగా వయో దాత్రే వయోమహ్యం ప్రతిగృహీత్వే - కన్యనిచ్చిన ఈ దాతకును, స్వీకరించిన నాకును బాంధవ్యం కలుగుగాక.

తేన అమృతత్వం అస్యామ్ - నేను ఈమె వలన అమృతత్వాన్ని అనుభవిస్తాను.

ఆ తర్వాత...

కన్యాదాత (మామగారు) : ధర్మేత్వయా ఏ షానాతిచరిత్వ, 'ధర్మాచరణముననువ్వు' ఈ మూడును అతిక్రమించరాదు' అన్నప్పుడు

వరుడు నాతిచరామి (అతిక్రమించను) అంటాడు. ఇలా ధర్మ, అర్థకామాలలో 'నాతిచరామి' (అతిక్రమించదు) అని వరుడు మాట ఇస్తాడు.

భార్యభర్తలు జీవిత సహచరులు, సమానులు. అనే భావం ఇందులో స్పష్టంగా వ్యక్తమౌతుంది. సర్వదేవమయుడైన అగ్ని సాక్షిగా చెప్ప మంత్రాలివి.

### మధుపర్కం.

ఆ తరువాత పెరుగు, తేనె కలిపి కంచుపాత్రలో పోసి దానిపై కంచుమూత పెట్టి దారాలతో బంధిస్తారు. ఆ ద్రవాన్ని దుర్భకుచ్చుతో వరునిచేతిలో ఇస్తారు. ఇలా మధుపర్కంతో పూజించడం పెద్ద గౌరవం.

### సుముహూర్తం.

ఆ తరువాత సమీక్షణం అంటే శుభముహూర్తానికై మంగళకర నేపథ్యంలో నిరీక్షిస్తారు.

తెల్లని బియ్యం తెచ్చి వాటితో శచీదేవిని పూజించి తెర పడతారు. తెరపట్టడానికి కారణం శుభముహూర్తంలో వరుడు అమ్మాయిని చూడాలికనుకనే తెరను ఉపయోగిస్తారు. జీలకర్ర, బెల్లాన్ని కన్యచేతిలో వుంచి, తెరకుతుర్పున పశ్చిమ ముఖంగా కూర్చుండబెడతారు. వరునికి జీలకర్ర బెల్లం యిచ్చి తెరకు పశ్చిమాన తూర్పు ముఖంగా కూర్చుండబెడతారు. వారీరువురూ ఇష్టదేవతా ధ్యానం చేస్తుండగా, మంగళ వాద్యాలు మోగుతుండగా తెర తొలగిస్తారు.

వరుడు ఇష్ట దేవతా ధ్యానం చేసుకుంటూ వధువు కనుబొమ్మల మధ్య భాగాన్ని చూస్తాడు. జీలకర్ర బెల్లాన్ని ఆమె నడినెత్తిన (బ్రహ్మరంధ్రంపై) వుంచుతాడు. అలాగే వధువు కూడా ఇష్టదేవతాధ్యానంతో పెళ్లి కొడుకు.

కనుబొమ్మల మధ్యన చేసి అతడినెత్తిన జీలకర్ర, బెల్లం ముద్దను వుంచుతుంది.

### ఇదే సుముహూర్తం ఇదే పెళ్ళిలో అతి ముఖ్య ఘట్టం.

వరుణుడు, బృహస్పతి, ఇంద్రాది దేవతలను స్మరించి, క్షేమం, శాంతి కలగాలని, అభివృద్ధి కలగాల'ని భావం గల మంత్రాలను చెప్పాడు. వరుడు సుముహూర్త సందర్భంలో.

నేను కన్యను చూసిన మహూర్తం సుమూర్తం అవాలి అంటే, పెద్దలు 'సమూహూర్తమస్తు' సుమూహూర్తము అగుగాక అని నిండు మనసుతో దీవిస్తారు.

ఆ తరువాతే వరుడు దర్భతో కన్యభ్రూ, మధ్యాన్నీ (కనుబొమ్మల నడిమి భాగాన్ని) ముమ్మారు తుడుస్తూ అవలక్షణాలు పొగొట్టే మంత్రాలను చెప్పుతాడు.

(కనుబొమ్మల మధ్య దర్శిస్తారు గనుకనే. అక్కడే వుండేలా నుదిటపై భాషికాన్ని కట్టడం కొన్ని ప్రాంతాల ఆచారం. పవిత్రమైన అక్షంతలు కొన్నయినా కిందపడకుండా వుండేందుకు ఆ భాషికాన్ని కడతారని కొందరి అభిప్రాయం. అయితే ఇది కొన్ని ప్రాంతాలలోనే వుంది. అదే విధంగా తలపాగా కూడా కొన్ని ప్రాంతాల వారి ఆచారం.

### సువర్ణ జలాలు

ఉత్తర దక్షిణాలుగా నిలువబడిన 'కాణి' యందు దక్షిణానవున్న కన్నంలోంచి నీరు జల్లుతూ, మంగళ సూత్రాన్ని కాడే చిల్లులో మాటుచేస్తారు. ఆ కాడె చిల్లు నుండి వచ్చిన జలంతో వధువు స్నానం చేయిస్తాడు వరుడు. ఆ జలాలు, శాంతిని కలిగిస్తాయని, సంసారాన్ని సారవంతం చేస్తాయని, బంగారు రంగుచేత శుద్ధమైన అగ్నులుగల ఆ జలాలు పవిత్రతను కలిగిస్తాయని భావం కల మంత్రాలు అక్కడ చదువుతారు.

ఆ తర్వాత కన్యకు నూతన వస్త్రాలను కట్టబెడతారు. అటుపిమ్మట జరిగేది 'యోక్త్రధారణ' అంటే దర్భతాడుతో వరుడు వధువు నడుమును చుట్టి ముడి వేయడం. దీనిని పత్నీ ప్రతోపనయం అంటారు.

మంచి మనస్సు సౌభాగ్యం సంతతి పొంది సహచారిణియై సత్కార్యాలకు సంసిద్ధం కమ్మని యిక్కడ చెప్పబడిన మంత్రార్థం.

### శతమానాలు మాంగల్యధారణ

వరుడు అవాహనచేసి, షోడశోపచారలతో మంగళ సూత్రాల్ని పూజిస్తాడు. పెళ్లి కొచ్చిన పెద్దలచేత ముత్తయిదువుల చేత దానిని స్పృషింపచేస్తారు. ఆ సూత్రాన్ని వరుడు వధువు కంఠాన కడతాడు.

మాంగల్యం తంతునానేన మమ జీవన హేతునా ! కంఠే బంధ్నామి సుభగే ! త్వంజీవ శరదశ్శతం !

"నా జీవనానికి హేతువైన ఈ సూత్రం చేత నీకంఠాన్ని అలంకరిస్తున్నాను. నువ్వు నూరేళ్ళు జీవించు అని దీని భావన.

### తలంబ్రాల అర్థం

మంగళ సూత్రధారణ తర్వాతి ఘట్టం 'అక్షతారోపణం' దీనినే తలంబ్రాలు అంటారు ఇది పెళ్ళిలో సందడి కలిగించే ఘట్టం. ఇందులో ఎంతో పవిత్రమైన హృదయం వుంది.

'అక్షంతలు పోయించుట' అని దీని అర్థం. తలపై పోసే ప్రాలు (బియ్యం) కనుక 'తలంబ్రాలు' అంటారు.

పురోహితుడు వధువు దోసిలి రెండుసార్లు అక్షింతలు వుంచి పాలు చల్లుతాడు. అలాగే వరుని దోసిలిలోను వుంచి, వధువు అంజలి(దోసిలి) కింద వరుని అంజలి వుంచుతాడు.

ఆ తరువాత ఆ అక్షింతలను వధూవరులు ఒకరు తలపై ఒకరు వేసుకుంటారు.

ఇక్కడ మంత్రాలలో : "పుణ్యం వర్థతాం శాంతిరస్తు, పుష్టిరస్తు, తుష్టిరస్తు, వృద్ధిరస్తు అవిఘ్నమస్తు, ఆరోగ్యమును స్వస్తి శివం కర్మాస్తు" అని ఇంకా కొన్ని మంత్రాలు వున్నాయి.

పుణ్యం వృద్ధిపొందాలి. శాంతి, పుష్టి,తుష్టి, వృద్ధి కలుగుగాక, విఘ్నాలు తొలుగుగాక, ఆయురారోగ్యాలు కలుగుగాక, క్షేమం మంగళం కలుగుగాక శుభకర్మలు వృద్ధి చెందుగాక అని వాటి అర్థం.

'మనస్సులోకి కోరిక, వాక్కు యొక్క సత్యం ఒకటి కావాలనే' దివ్య మంత్రం మంచి జీవితానికి తారక మంత్రమే. త్రికరణ శుద్ధిగా భార్య భర్తల దివ్య దాంపత్యం వర్ధిల్లాలనే మహాభావన ఇందులో వుంది.

యథాహమస్యా అతృపం స్త్రీయైపుమాన్.

ఈ స్త్రీ యందు పురుషుడు తృప్తి పొందేలా.

యథాహస్త్రీ తృప్యతి పుంసి.....

ఈ పురుషుని యందు స్త్రీ తృప్తిచెందేలా, అగ్ని, వాయువు, చంద్రుడు, ఆదిత్యుడు, జలములు అనుగ్రహించుగాక... అనే భావనమున్న మంత్రాలు చదువుతారు.

ప్రజామే కామ: సమృధ్యతాం.

మాకు కోరిక కొలది సంతతి వృద్ధి చెందుగాక

శ్రీయో మే కామ: సమృధ్యాత్యాం

మాకు కోరిక కొలది సంపద వృద్ధి పొందుగాక అనే శుభకామనలు మంత్రాలుగా ఇక్కడ చెప్పబడతాయి.

### రక్షాబంధనం

దాని తరువాత వరుని కుడిచేతికి, వధువు ఎడమ చేతికి రక్షాబంధనం కడతారు. (దీనిని నాల్గవ నాటి రాత్రి విప్పాలి) ఇది సత్య ఆపదల నుండి రక్షించి, శోభని, శక్తినీ, క్షేమాల్ని, భద్రతన్నీ సమకూర్చుతుందని యిక్కడ మంత్రాల అర్థం.

### బ్రహ్మముడి

ఆ తరువాత వధువు చీర అంచునీ, వరుడి ఉత్తరీయం అంచునీ కలిపి ముడి వేయడాన్నే బ్రహ్మముడి (కొంగుముడి) అంటారు.

ధ్రువంతే రాజావరుణోధ్రువందేవో బృహస్పతిః ధ్రువంత ఇంద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్!

ఈ దాంపత్య సామ్రాజ్యాన్ని ధరించే మీకు వరుణుడు, బృహస్పతి, ఇంద్రుడు, అగ్నిదేవతలు నిశ్చలత్వం కలుగచేయుదురుగాక!

అటు పిమ్మట ఇద్దరూ అగ్నిహోత్రం దగ్గరకొచ్చి నమస్కరిస్తారు. అప్పటి మంత్రంలో వరుడు.

'గచ్ఛ గృహపత్నీ యథా సో వశినీ త్వం విదం అవదాసి'

(ఇంటి యజమానిరాలిగా అంతటికి పెత్తనం వహించి, తీర్చి దిద్దుకునే దానివిగా ఇంటికి

రా) అని వధువుని ఉద్దేశించి అంటాడు. స్త్రీకి గృహ రాజ్యంలో ఉన్న ప్రాధాన్యం ఈ మంత్రాలలో పేర్కొన్నారు.

## ప్రధాన హోమం

ఆ తరువాత జరిగేది ప్రధాన హోమం, గృహస్థాశ్రమంలో కొత్త దంపతులు చేసే ప్రథమ హోమం ఇది. సత్సంతానార్థమై, సుఖజీవనంకై, దీర్ఘ ఆయుష్షుకై జరిగే ఈ హోమకర్మలో ఛాందోగ్య బ్రాహ్మణ మంత్రాలు కూడా వుంటాయి.

దీనిలోని ప్రధాన మంత్రాల్లో ఒకటి - 'నీ పిల్లల్లో నేనూ ఒకడిని అవాలి' అని(వరుడి) ఈ భావం, మహోన్నతమైనది. మగవాడని ప్రేమతో శాసించి, లాలించి, ధర్మ మార్గంలో నడిపే మాతృత్వ శక్తి స్త్రీ అని వివాహం మంత్రాలు పేర్కొంటున్నాయి.

## భార్యభర్తలు స్నేహితులు

## పాణి గ్రహణం

ఈ ఘట్టంలో వధువు వరుని చేయి పట్టుకుంటుంది. ఈ పాణిగ్రహణ మంత్రాలలో - 'మనమూ సనాతన మార్గాన్ని అనుష్టించెదముగాక,' ("వధువుని అగ్రగణ్యగా చేయుగాక") అని చెప్పబడింది.

## ఏడడుగులు

దీనినే సప్తపది అంటారు. అగ్ని హోత్రానికి దక్షిణంగా కుడికాలు ముందు పెడుతూ ఉత్తరానికిగానీ తూర్పుకుగానీ, వధువుతో వరుడు నడుస్తాడు. ఈ ఏడు అడుగులలో ఒక్కో అడుగులలో ఒక్కో శక్తి వుంది. ఇక్కడ మంత్రాలు పేర్కొన్న ప్రకారం.

1. మొదటి అడుగు అన్నాన్ని. 2. రెండో అడుగు బలాన్ని (శక్తిని) 3. మూడో అడుగు సత్కర్మలను (వ్రతాన్ని) 4. నాలుగో అడుగు ఆనందోత్పత్తిని 5. అయిదో అడుగు పశు సమృద్ధినీ, అవయవ పుష్టిని 6. ఆరో అడుగు రుతుసంపదలను 7. ఏడో అడుగు గృహస్థాశ్రమ హోమ యజ్ఞాలను విష్ణుకృపతో అందజేస్తాయి. ఏడో అడుగు తరువాత వరుడు చెప్పే మంత్రాలు

సఖా సప్త పదా భవ.

ఏడు అడుగులతో నీవు నా సఖివి అగుము.

సఖాయౌ సప్త పదా బభూవ

ఏడడుగులతో ఇరువురూ సఖులయ్యారు.

సఖ్యంతో గమేయం సఖ్యాత్

సహవాసంతో సౌఖ్యాన్ని పొందుదుముగాక.

ఈ మంత్రాల ద్వారా వివాహం లక్షణం చెప్పబడింది.

భార్యభర్తలు నిజమైన స్నేహితులు. ఇది అగ్ని సాక్షిగా జరిగిన వివాహం.

దాంపత్యం ఒక స్నేహం.

దాంపత్యం ఒక స్నేహం ఒకరికొరకై సరిసమాన స్థితిలో మనస్సు యిచ్చిపుచ్చుకొని, స్నేహ పూర్వకంగా మెలగుతూ, పరస్పర ప్రోత్సాహంతో ధర్మాన్ని ఆచరించడమూ దాంపత్యం **"పురుషుడుకి నిజమైన నేస్తం-భార్యే"** అని మహాభారతంలో ధర్మరాజు.... (యక్షప్రశ్నలలో) వివరించాడు.

## లాజహోమం

'సప్తపది' తర్వాత చేసేది లాజహోమం.

లాజాల (పేలాల)తో చేసే హోమం ఇది. భర్తకు దీర్ఘాయువు, తనకు దీర్ఘ సుమంగళత్వం కలగడానికై పేలాలను అగ్నికి ఆహుతి చేస్తుంది. వధువు, ఈ హోమం ద్వారా స్వస్థత, సంతతి వృద్ధి ధృడమైన జీవనోపాధి కలగాలని ఇక్కడ మంత్రాల భావం.

అగ్ని హోత్రానికి ఉత్తరంగా వధువు కుడికాలితో ఒక రాతిని(సానపీఠ) తొక్కిన వరుడు చెప్పే మంత్రంలో "ఈ రాయి లాగా సుస్థిరంగా నువ్వుండాలి శత్రుబాధలు నశించాలి" అని కోరును.

వరుడు, వధువు తమ్ముడు, వధువు చేతిలో పేలాలు, నెయ్యి పోశాక వధువు వాటిని అగ్నిలో ఆహుతి చేస్తుంది.

'భార్యకెలాంటి అనారోగ్యం కలిగించనీయననీ' శాశ్వతంగా స్థిరంగా తమ దాంపత్యం చల్లగా వర్థిల్లాలని ఛాందోగ్య బ్రాహ్మణ మంత్రాలతో వరుడు కోరతాడు.

నా 'భార్య ధీర్ఘయుస్సుతో, సుమంగళిగా వుండేలా ఆశీర్వదించమని పెద్దలను అడుగుతాడు వరుడు.

నా మనసు తెలిసినవాడిగానూ మంచి సంస్కార పండితుడిగాను, నియమం, నిజాయితీ వున్న తేజస్విగానూ నిన్నునేను గ్రహించాను.

నువ్వు నాతోనే కలిసి వుంటూ, సిరిసంపదలు సంపాదించాలి. సుఖంగా జీవించాలని

వధువుచేత చెప్పించే ఒక మంత్రం.

వధూవరులిరువురూ కలిసి విశ్వదేవతలు, పవిత్ర జలాలు బ్రహ్మ, వాయుదేవుడు - మన మనుష్యుల్ని స్నేహంతో కలిసి పోయేలా చేయాలని కోరతారు. వధువు కాలివేలికి వరుడు స్వయంగా మట్టెలు తొడగడం విశేషం. మట్టెలు, నల్లపూసలు సౌభాగ్య చిహ్నాలు.

### నక్షత్ర దర్శనం

వధూవరులకు మొదట ధ్రువనక్షత్రం చూపిస్తారు. వారు ధ్రువంగా (స్థిరంగా) జీవించి వృద్ధి చెందాలని దీని భావం. ఆ తరువాత అరుంధతి నక్షత్రాన్ని చూపిస్తారు. 'సప్తర్షయః ప్రథమాంకృత్తికానామరుంధతి...' అని మొదలయ్యే మంత్రం ద్వారా, సప్తర్షులు కృత్తికల్లో మొదటి సారిగా అగ్రస్థాయినిచ్చి గౌరవించిన సాధ్వీమతల్లి అరుంధతి అని పేర్కొనబడింది. 'అరుంధతి' అంటే భర్త యొక్క సత్కార్యంకు, 'ధర్మానికి రోధనం' (ఆటంకం) కలిగించనది అని అర్థం ఈ అరుంధతీ నక్షత్ర సందర్శనం ద్వారా వధూవరులు జీవితంలో ఆటంకం లేకుండా ధర్మమయ సౌఖ్యం కలగాలని ఋషి సంకల్పం. ఆ తరువాత పెద్దల నుండి అమోఘమైన దీవెనలందుకుంటారు వధూవరులు.

### అప్పగింతలు

ఇది శాస్త్రంలో లేదు. వధువు తరపు వారు వరుడికీ, వరుని తరుపువారికి తమ కుమార్తె బాగోగులు ఇక 'మీవే' అని చెప్పుకొనే ఘట్టమిది. ఈ భావం పెళ్లి ఘట్టాల్లోనే చెప్పబడినప్పటికీ, ప్రత్యేకంగా ఈ అప్పగింతల ముచ్చట తరువాత వచ్చింది. ఒక వేడుకగా ఇది అంగీకారయోగ్యమే. ఇందులో పరస్పర ఆప్యాయతలు, కుటుంబబంధాలలోని అనురాగ మాధుర్యాలు, ప్రేమానుబంధాలు ద్యోతకమవుతాయి. రెండు మనసుల్నీ రెండు జీవితాల్ని ఒకదైవ కార్యంగా, విశ్వశ్రేయస్సుకి మధ్య సంస్కారంగా కలుపు దివ్యమైన ఘట్టం-వివాహం ఈ వివాహం దంపతులకి జీవితాంతం గుర్తుండే మధుర స్మృతి. ఉ [illegible]రమైన దేవతల అమోఘాశీస్సులు లభించే వేడుక ఇది. పెళ్ళిలోనూ, పెళ్ళికి పూర్వ రంగంలోనూ కొన్ని ఘట్టాల్లో కొన్ని వర్ణాలవారికీ, ప్రాంతాలవారికీ, ఇంటి సాంప్రదాయం అనుసరించీ చాలా భేదాలుంటాయి. కొన్ని అంశాలు కొన్ని కుటుంబాలకు వుండవు కూడా అటువంటప్పుడు 'ఫలానా ఘట్టం మాకు ఆచారంలో లేదే అనుకోవలసిన అవసరం లేదు. ఎవరి ఆచార సాంప్రదాయాలను వారు అనుసరించడమే ముఖ్యం. ఏదేమైనా, సాంప్రదాయ ప్రకారం అన్ని పద్ధతులకీ ప్రధాన సూత్రం, లక్ష్యం ఒక్కటే వాటిని అవగాహన చేసుకోవడం అవసరం. పెళ్ళి అనేది ఒక శాశ్వతస్నేహానికి నాంది జీవితంలో నిండు నూరేళ్ల సంఘ ప్రమాణానికి పునాది, ప్రకృతి దేవతా శక్తులసాక్షిగా బాసలు చేసుకొనే దివ్యమైన మహోత్సవం దాంపత్య రథానికి ఇరుచక్రాలు భార్యాభర్తలు. అనే సమాన సిద్ధాంతం సనాతన వివాహ ధర్మం తెలియజేస్తున్న నిత్యసత్యం.

## వివాహ వైశ్య గోత్రముల వరసలు

| వరుడు | వధువు | శుభ ప్రదమైనవి |
|---|---|---|
| 1. పెండ్లికుల | 1 మాసంతుకుల | |
| 2. మాసంతకుల | 2 ధనకుల | ౨-౧ మరుదలు |
| 3. బుధనకుల | 3 వస్త్రకుల | |
| 1. పెండ్లికుల | 1 మాసంతకులు | |
| 2. శిలకుల | 2 పెండ్లికుల | ౧-౨ కోడలు |
| 3. ధనకుల | 3 గంధశిల | |
| 1. పెండ్లికుల | 1 దేశెట్ల | |
| 2. గంధశిల | 2 బుధకుల | ౩-౨ మేనత్త |
| 3. శిలకుల | 3 ఎలిశెట్ల | |
| 1. పెండ్లికుల | 1 ఎలిశెట్ల | |
| 2. బుధకుల | 2 ధనకుల | ౧-౩ మనుమరాలు |
| 3. శిలకుల | 3 పెండ్లికుల | |
| **వరుడు** | **వధువు** | **అశుభ ప్రదమైనవి** |
| 1. పెండ్లికుల | 1 మాసంతకుల | |
| 2. బుధకుల | 2 ధనకుల | ౩-౧ తల్లి |
| 3. మాసంతకుల | 3 వస్త్రకుల | |
| 1. పెండ్లికుల | 1 పెండ్లికుల | |
| 2. దేశెట్ల | 2 ధనకుల | ౧-౧ చెల్లెలు |
| 3. అనంతకుల | 3 వెనిశెట్ల | |
| 1. మూలకుల | 1 గంధశిల | |
| 2. శిలకుల | 2 శీలకుల | ౨-౨ చెల్లెలు |
| 3. ధనకుల | 3 వెనిశెట్ల | |
| 1. బుధకుల | 1 దేశెట్ల | |
| 2 గంధశిల | 2 పునిగిశిల | ౨-౩ పుత్రిక |
| 3 వస్త్రకుల | 3 గంధశిల | |
| 1 పునిగెశిల | 1 గంధశిల | |
| 2 మాసంతకుల | 2 శిలకుల | ౩-౩ చెల్లెలు |
| 3 ధనకుల | 3 ధనకుల | |

నాయక ప్రథమంబు నారీతృతీయంబు, మానుగా గూడిన మనుమరాలు పురుషునిది మూడోది పూబోణి మొదటిది, దనరంగ గలసిన తల్లివాని పిల్లవానిది రెంట పిల్లది మూడింట పొసగజేసిన నాతి పుత్రికయగును. పరగనాథుని మూట పడుచుది రెంటను నమరిననామె మేనత్తయగును. కూడనొక సతీపతి రెంటకోడలగును. వరుని రెంటను సతియాది మరదలయ్యె పిల్లలిద్దరు నొక్కటైన చెల్లెలగును. వైశ్య గోత్రంబు లీరీతి వరుసదెలసీ పెండ్లి జేసిరి తగునని పెద్దలపుడు.

# వైశ్యుల (102) గోత్ర ప్రవరలు

1. అగస్త్యస గోత్రములు (అనపకుల-అనపాల-అనుపకుల-అనుపాల) అగస్త్య మాహేంద్ర మాయోభవేతిత్ర్యార్షేయ ప్రవరాన్విత అగస్త్యస గోత్ర యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

చంద్రలేక శృంగాఖ్య శ్రేష్ఠి

2. ఆత్రేయస గోత్రము (అరశిష్ట కుల-యెలిశెట్ల-అరసకుల-యాలుకుల-అరిశెట్ల-ఎలశిష్టకుల-ఎలిశెట్ల-యరశిష్ఠ-హరిశిష్ఠ) ఆత్రేయ అర్చనానస శ్యావాశ్వేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత ఆత్రేయస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

రాజముఖి రాజశ్రేష్ఠి

3. అచ్ఛాయనస గోత్రము (అగ్రమూల-అఘ్యమూల-అర్ఘ్యమూల-అమలకుల) అంగీరస-అశ్వలాయన, ఆచ్ఛాయనేతి త్ర్యార్షేయ, ప్రవరాన్విత ఆచ్ఛాయనసగోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

విమల కపిల శ్రేష్ఠి

4. ఉగ్రసేనసగోత్రము (కుమార శిష్ట - కొమిరిశెట్ల-కుమిరిశిష్ట-ఉగ్రశిల-కోమర శిష్టకుల) భార్గవ-ఔగ్రసేన ఔర్వసేనేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత ఉగ్రసేనసగోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

హలకాంబ పార్థివశ్రేష్ఠి

5. ఉత్కృష్టస గోత్రము (కన్యకుల-కానుకుల-క్రానుకుల) భార్గవ ఔత్కృష్టేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత ఉత్కృష్టసగోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

కమలాక్షి సమ్మదశ్రేష్ఠి

6. ఉత్తమౌజస గోత్రము (ఉతకాల-ఉతకుల-ఉతశిష్ట-వుతకాల-ఉత్తమకుల) అంగిరస నారద ఔత్తమోజసేతిత్ర్యార్షేయ ప్రవరాన్విత ఉత్తమౌజసగోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

ధర్మాంబ ఉత్తమశ్రేష్ఠి

7. ఋష్యశృంగస గోత్రము (అనంతకుల) అంగిరస ఋష్య శృంగేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత ఋష్యశృంగసగోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

అనుమిత ఆనందశ్రేష్ఠి

8. ఔచిత్యస గోత్రము (యనసకుల-యానస-యానసఖి) అంగిరస ఔచిత్యేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత ఔచిత్యస్య గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే

నీలవేణి భాసుర శ్రేష్ఠి

9. కణ్వస గోత్రము (కర్ణకుల-కర్ణాట-కరుటకుల-కాటకుల-కాటు-కమటకుల-కోటకుల-కొటుకుల) అంగిరస అజామీఢ కాణ్వేతిత్ర్యార్షేయ ప్రవరాన్విత కణ్వనగోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

సమదర్శిని సోమదశ్రేష్ఠి

10. కందర్పస గోత్రము (చరకుల-చేగొడ్డకుల-శమనకుల-చేగోళ్ళ-చేగొండ-మనకుల-శ్రేష్ఠ కుండల) అంగిరస కాంచన కాందర్పేతి త్ర్యార్షేయప్రవరాన్వితకందర్పస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

అమృత భాషిణి గౌతమశ్రేష్ఠి

11. కపిలస గోత్రము (మండు-మందకుల-మండకుల-హస్తకుల) అంగిరస కాపిలేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత కపిలస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

కంబుకంఠి కపిలశ్రేష్ఠి

12. కపీతన గోత్రము (వెంకాల కుల - వెంకోల) అంగిరస-దమబాహ్య ఊరుక్షయేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత కపీతస గోత్రః యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

కుముదవల్లి సుదర్శనశ్రేష్ఠి

13. కాశ్యపస గోత్రము (గణముఖి-గణపకుల-గణముఖు) కాశ్యప ఆవత్సార ఆసతేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత కాశ్యపస గోత్రః - యజుశ్శాఖాధ్యాఈ ఆపస్తంబసూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

ధనలక్ష్మి ధనశ్రేష్ఠి (గణపశ్రేష్ఠి)

14. కుత్సస గోత్రము (ఇక్ష్వాకుకుల-కదంబకుల) అంగిరసమాంధాత కైత్సేతిత్ర్యార్షేయ ప్రవరాన్విత కుత్సస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

చంచలాక్షి పావనశ్రేష్ఠి

15. కౌండిన్యసగోత్రము (ఘనలోల-ఘనశీల-గణశీల-ఘనశీల) భార్గవ కైండిన్య ద్వ్యార్షేయ ప్రవరాన్విత కైండిన్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో

అభివాదయే.

కమల గౌరశ్రేష్ఠి

16. కౌంతేయసగోత్రము (కామశిష్ట-కామిశెట్ల) భార్గవ కౌంతేయేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత కౌంతేయస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః(    ) గుప్తో హంభో అభివాదయే.

కుందవదన గోవిందశ్రేష్ఠి

17. కౌశికసగోత్రము(కరకపాల-కనకపాల) భార్గవ కౌశికేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత కైశికస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః (    ) గుప్తోహంభో అభివాదయే.

అర్కాంబ మల్లాఖ్య శ్రేష్ఠి

18. కృష్ణస గోత్రము (ధనికుల-ధనకుల-ధనదకుల-ధేనుకుల) భార్గవ కార్ష్ణేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత కృష్ణస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః (    ) గుప్తోహంభో అభివాదయే.

శ్యామల కృష్ణ శ్రేష్ఠి

19. గార్గ్యసగోత్రము (ప్రహిణి కుల-ప్రహీణు-పమిడికుల-పైడికుల) ఆంగీరస సైన్య - గార్గేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత గార్గ్యసగోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః (    ) గుప్తోహంభో అభివాదయే.

కాళీదేవి కాలకంఠశ్రేష్ఠి

20. గృత్సమదస గోత్రము (ఇనపకుల-ఇనుకుల-ఇనుపకుల-ఇన-ఇషుప-చన్నకుల-చెన్నకుల-అనప-జనకుల-జాను-ఎన్నికుల)
భార్గం శౌనహోత్ర గార్త్సమదేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత గృత్సమదస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః (    ) గుప్తోహంభో అభివాదయే.

కమల గజసత్వ శ్రేష్ఠి

21. గోపకస గోత్రము (ఇంచుపకుల-గొంటకుల-ఇంచుపాహ్వయ-గోపకుల-గుంటకుల-గోటకుల-ఘోటక) ఆంగీరస ఘోంటక గౌపకేతి గ్ర్యార్షేయ ప్రవరాన్విత గోపకసగోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః (    ) గుప్తోహంభో అభివాదయే.

కీర్తికాంత ఉత్పలాక్ష శ్రేష్ఠి

22. గౌతమస గోత్రము (గంథశిలకుల-గందశిల-గంధశీల-(గ్రంధిశిల) ఆంగీరస ఆయాస్య గౌతమేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత గౌతమసగోత్రః యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః (    ) గుప్తోహంభో అభివాదయే.

లోలాంబ లోకాహ్వయ శ్రేష్ఠి

23. చక్రపాణిస గోత్రము (చక్రమూలకుల-చంద్రకుల-చంద్రమూల-చక్రమూలస) ఆంగీరస చాక్రపాణితి ద్వార్షియ ప్రవరాన్విత చక్రపాణిస గోత్రః - యజుశ్శాఖాధ్యాఈ ఆపస్తంబసూత్రః (    ) గుప్తోహంభో అభివాదయే.

తనుమధ్య ధృతసత్వ శ్రేష్ఠి

24. చామరణస గోత్రము (పెద్ద శ్రేష్ట-పెద్ది శిష్ట-బధశిష్ట-పెద్దిశెట్ల-బద్ధశిష్ట) భార్గవ చార్షణేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత చామర్షణస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః (    ) గుప్తోహంభో అభివాదయే.

హేమంగి మత్స్యధ్వజ శ్రేష్ఠి

25. జడభరతస గోత్రము (గుండకుల-దూరశిష్ట) భార్గవ జాడభరతేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత జడభరతస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః (    ) గుప్తోహంభో అభివాదయే.

మణిమంజరి ఆదిత్యశ్రేష్ఠి

26. జతుకర్ణస గోత్రము (చంద్రకుల-చంద్రమశిష్ట-చంద్రమూల-చంద్రశిష్ట-చందమూల-చందకుల) ఆంగిరస చాంద్రశిష్ట జాతుకర్ణేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత జతుకర్ణస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః (    ) గుప్తోహంబో అభివాదయే.

బాలామణి బలదేవశ్రేష్ఠి

27. జంభసూదనస గోత్రము (త్రిమూలకుల) భార్గవ జంభసూదనేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత జంభ సూదనస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః (  ) గుప్తో హంభో అభివాదయే.

మోహనాంగి సుందరశ్రేష్ఠి

28. జరత్కారస గోత్రము (ధన్నకుల-జానికుల-జనకుల-జానకుల-జాను-జ్యాను) ఆంగిరస జాహ్నవజాత్కారణేతి త్వార్షియ ప్రవరాన్విత జాహ్నవ జాత్కారసగోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః (  ) గుప్తోహంభో అభివాదయే.

కళావతి చంద్రాఖ్య శ్రేష్ఠి

29. జాబాలిస గోత్రము (సురిశిష్ట కుల - సూరశిష్టకుల) భార్గవ జాబాలేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత జాబాలిస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః (    ) గుప్తోహంభో అభివాదయే.

పావని చంద్రబాణ శ్రేష్ఠి

30. జాభేయస గోత్రము (శనిశెట్ల-చనశిష్ఠ-చినిశిష్ట-చినిశెట్ల-శినిశెట్ల-శెనిశెట్ల) భార్గవ శాండిల్యేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత జాభ్రయస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః (    )

గుప్తోహంభో అభివాదయే.

చంద్రకళ చంద్రమౌళి శ్రేష్ఠి

31. జీవన్తిస గోత్రము (భూతిలాశిష్ట-భ్రమశిష్ట-వృద్ధికుల) భార్గవ జైవంతీతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత జీవన్తిస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

సోమప్రభ సింహధ్వజ

32. తరణిసగోత్రము (త్రివిక్రమ శిష్ట-త్రివిక్రమకుల) భార్గవ తారణీతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత తరణిస గోత్రః యజుశ్శాఖాధ్యాయీ ( ) గుప్తోహంభో అభివాదయే.

బాలామణి జనార్ధన శ్రేష్ఠి

33. తిత్తిరిస గోత్రము (భమదకుల-భ్రమద-భ్రమర-బ్రహ్మకుల-భ్రవద) ఆంగిరస కవిభూతి తైత్తిరీయేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత తిత్తిరిస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

భూమాంభ బ్రహ్మశ్రేష్ఠి

34. త్రిజటస గోత్రము (ఉపరికుల-ఉశీర-ఉప్పాల-ఉశిరికుల) భార్గవ త్రైజటేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత త్రిజటస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

మంజువాణి సుందరశ్రేష్ఠి

35. త్రైత్రేయస గోత్రము(చిదురుపేళ్ళ-చిద్రుపేళ్ళ-చతురపేళ్ల-చిద్రూపకుల) ఆంగిరస త్రైత్రేయేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత త్రైత్రేయనప గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

సుదర్శిని పాదాఖ్యశ్రేష్ఠి

36. దాల్భ్యస గోత్రము (పటనశిష్ట-పటినకుల-పటన-ఫలకకుల-పలకలకుల) ఆంగిరస పాలకదాల్భ్యేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత దాల్భ్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

పల్లవపాణి వల్లభ శ్రేష్ఠి

37. దూర్వాసస గోత్రము (దిదశ-దినకుల-దెంతకుల-దంతకుల-దెంతాశుల) భార్గవ దౌర్వాసేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత దూర్వాసస గోత్రః ( ) యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

చిత్రలేఖ కుశలశ్రేష్ఠి

38. దేవరాతస గోత్రము (హిరరాజ-హరీత-హిరరాశికుల) ఆంగిరస దైవరాతేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత దేవరాజతస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

మణిమాల ఘనముఖ శ్రేష్ఠి

39. దేవవల్క్యస గోత్రము (ఉశిరికుల-దేవశెట్ల-దేవకుల-దేశిష్ట) భార్గవ హరివక్ర దైవవల్క్యేతిత్ర్యార్షేయ ప్రవరాన్విత దేవవల్క్యస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

భ్రమరామణి దంతునామార్యులు

40. నారదస గోత్రము (పాలక కుల-పాలకుల) భార్గవ నారదేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత నారదస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

హేమరేఖ స్వర్ణరథశ్రేష్ఠి

41. నేత్రపాదస గోత్రము (చందోగు-చందకుల-ఛందోగు-చంద్రకుల) భార్గవ నైత్రపాదేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత నేత్రపాదస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

సుబోధిని సింహసేన శ్రేష్ఠి

42. పరస్పరాణ్యస గోత్రము (తువ్విశిష్ట-పౌలస్త్యకుల-శ్రీపుంశిక) ఆంగిరస సంస్కృతి గేరవేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత పరస్కరాయణ్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్గంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

ధనదాంబ మూలాఖ్య శ్రేష్ఠి

43. పల్లవసగోత్రము (గణపకుల-ఘంటకుల-ఘంటారుల-ఘంటసుకుల-ఘంటస్థూల) ఆంగిరస ఘంటస్థూలపాల్లవేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత పల్లవస గోత్రః యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

నీలాంబ నందాఖ్యశ్రేష్ఠి

44. పవిత్రపాణిస గోత్రము (దయ శిష్ఠకుల - దయాశిష్ఠ - దశెట్లకుల - దశిష్ఠకుల - దేశెట్ల - దేశిష్ఠకుల - దైశిష్ఠ) ఆంగిరస పావిత్రపాణీతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత పవిత్రపాణిస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

ధనలక్ష్మి ధనదశ్రేష్ఠి

45. పారశర్యస గోత్రము (కామధేను-పడగశిల-పడిగశిల-కమతకుల-పాంచాళ-ప్రాణసుల-

పాణుసులకుల-ప్రాణశీలకుల-పావల్ల-ప్రాగ్భాలకుల-ప్రౌఢశీల-పాపాల్ల-పాపాల-పాంబాళ) ఆంగీరస ప్రౌఢశీల ప్రాగ్భాల కామధేను పారాశర్యేతి పంచార్షేయ ప్రవరాన్విత పారాశర్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

పల్లవాంబ పాలాహ్వాయ శ్రేష్ఠి

46. పింగళస గోత్రము(ఆర్య్య కుల - అయనకుల-ఐనకుల) ఆంగీరస అంబరీష యౌవనాశ్వేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత పింగళస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

పోతాం భోభాఖ్య శ్రేష్ఠి

47. పుండరీకస గోత్రము (అనుశిష్ట-క్రానుకుల-తొంటికుల) ఆంగీరస పౌండరీకేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత పుండరీకస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

కనకాంగి కుముదశ్రేష్ఠి

48. పూతి మాషస గోత్రము (తుర్యాటి-తునిశెట్ల-తుర్యాటకుల-తులశిష్ఠ-తులిశెట్ల-తులసి-తోటకుల-తోటికుల) ఆంగీరస గౌరవీత సాంకృత్యేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత పూతిమాషస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

చంద్రముఖి పాలాఖ్యశ్రేష్ఠి

49. పౌండ్రకస గోత్రము (పుంశిమాంశుకుల-పుంసిమాస-పోలిశెట్టి-ప్రోశిష్ఠకుల-ప్రోలి-ప్రోలేఖ-పాలసిల-పోషికుల) ఆంగీరస ప్రౌల్లేఖ పౌండ్రకేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత పౌండ్రకస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

పుష్పాంబ భువనశ్రేష్ఠి

50. పౌలస్త్యస గోత్రము (గోశీల-ఉత్తమగోశీల-పల్లవగోశీల-పటుగోశీల-శ్రీగోశీల-భీమగోశీల-సత్యగోశీల-నందిగోశీల-పునగోశీల-సూర్యకుల-గోశ్రీల-శ్రీలగోశీల-శ్రీపుంసకుల-పునగశిల) ఆంగిరస పౌలస్త్యేతిద్వ్యార్షేయ ప్రవరాన్విత పౌలస్త్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

బుక్మవతి పావనశ్రేష్ఠి

51. ప్రాచీనస గోత్రము (వెనిశెట్ల-ఎలిశెట్ల-వనిశిష్టకుల-యెనిశెట్ల-వెన్నశిష్టకుల-ఎనిశెట్ల-వెలుశిష్ట-చనశిష్టకుల-వెలిశెట్ల) భార్గవ ప్రాచీనేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత ప్రాచీనస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

చిత్రాంగి విన్నవరేణ్య శ్రేష్ఠి

52. ప్రాభాతస గోత్రము (ఉద్వాహకుల - పెండ్లికుల - రవిశిష్ట) ఆంగిరస రావిశిష్ట ప్రాభాతేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత ప్రాభాతస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

కుసుమాంబ కుసుంభ శ్రేష్ఠి

53. బృహదశ్వస గోత్రము (పేరుశిష్ట-పేరిశెట్ల-ఫేరిశిష్టకుల-ఫైరుశిష్ట-పేరిశిష్ట) ఆంగీరస బార్హద్శ్వేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత బృహదశ్వస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

బింబాధరి పీనవక్షశ్రేష్ఠి

54. బోధాయనస గోత్రము (బుద్ధికుల - బుధనకుల) భార్గవ బోధాయనేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత భోధాయనస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

ఇభయాన నాగాఖ్యశ్రేష్ఠి

55. భారద్వాజస గోత్రము (బలశిష్ట-బలిశెట్ల-బలశేష్ట-బలిశిష్ఠ) ఆంగిరస బార్హస్పత్య భారద్వాజస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

పల్లవాంబ భోగాఖ్య శ్రేష్ఠి

56. భార్గవస గోత్రము (పృథివి శిష్ఠ - పృథ్విశ్రేష్ఠ) భార్గవ పార్థివశిష్ఠేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత భార్గవస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

పృథ్వీదేవి వృథునామ శ్రేష్ఠి

57. మందపాలస గోత్రము (విన్నస-వెనుకుల-విన్నకుల-వినుకుల-యెన్నకుల-వెన్నకుల) భార్గవమందపాలేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత మందపాలస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

విన్నాంబ విశ్వనాథ శ్రేష్ఠి

58. మానవస గోత్రము (మన్యకుల-మన్యస-మానాభ-మానసకుల-మానాచ్ఛ) ఆంగిరస మానవేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత మానవస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

విచక్షణాంగి దక్షిణాహ్వాయ శ్రేష్ఠి

59. మరీచిస గోత్రము (దీక్షమ శిష్ఠస-దీక్షమకుల-దీక్షమ శ్రేష్ఠ) భార్గవ మారీచేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత మరీచిస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో

అభివాదయే.

భామామణి భాస్కరశ్రేష్ఠి

60. మార్కండేయస గోత్రము (మోదుకుల-మోరుకుల-మూర్క్కల-మోర్కాలకుల-మోరుక-మౌర్ఖస-మోరుస-కేశలశిల) భార్గవ మార్కండేయేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత మార్కండేయస గోత్రః - ( ) గుప్తో హంభో అభివాదయే.

పిప్పలాంబ నాగధ్వజ శ్రేష్ఠి

61. మునిరాజస గోత్రము (పద్మ శిష్టస - పద్మశిల - పద్మశెట్ల - పద్మశ్రేష్ఠి) భార్గవ మౌనిరాజేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత మునిరాజస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

సరస్వతి సరసశ్రేష్ఠి

62. మైత్రేయ సగోత్రము (మద్దికుల - మధనకుల - మధ్యకుల - మధ్యనకుల - మిధునకుల - మైత్రికుల) భార్గవ దైవోదాన వాధ్ర్యశ్వేతిత్రార్షేయ ప్రవరాన్విత మైత్రేయసగోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే

నాగమణి నాగాఖ్యశ్రేష్ఠి

63. మౌసలస గోత్రము (చంద్ర-చంద్రకుల-సందకుల-చందక-చందాలకుల-చంగాలకుల) భార్గవజాంభసూదన మౌసలేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత మౌసలస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

కమలాంబ గౌరాఖ్య శ్రేష్ఠి

64. మౌంజాయనస గోత్రము (ముంజు-ముంజికుల-మౌంజిస-మౌంజికుల) భార్గవ మౌంజాయనేతాద్వ్యార్షేయ ప్రవరాన్విత మైంజాయనస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అబివాదయే.

మంజువాణి గుణపుంజ శ్రేష్ఠి

65. మౌద్గల్యస గోత్రము (నాభిళ్ళ-మునకాల-నాభికుల-నాభిలస-మునికుల-నాబిళ్ల-మూలకుల) ఆంగీరస భార్మ్యశ్వ మౌద్గత్యేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత మౌద్గల్యస గోత్రః యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభి అభివాదయే.

భ్రమరాంభ బాలాహ్వయ శ్రేష్ఠి

66. యాస్కస గోత్రము (వ్యాళవెకులస-వెలిగోళ్ళ-యెలిగోళ్ళ-సేలగాల) భార్గవ వైతహవ్య సావేతతి త్ర్యార్షేయ ప్రవరాన్విత యాస్కస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

నవనీతాంగి విన్యాఖ్య శ్రేష్ఠి

67. యాజ్ఞవత్క్యస్య గోత్రము (అభిమంచికుల-అభిముంజి) ఆంగీరస యాజ్ఞవల్క్యేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత యాజ్ఞవల్క్యస్యస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

అభివాంబ అమలశ్రేష్ఠి

68.వటుకస గోత్రము (అనుమర్తణకుల) ఆంగిరస వాటుకస్థూల శిరస్కేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత వటుకస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

తారకాంబ వామనశ్రేష్ఠి

69. వరతస్తుస గోత్రము (మాసంత-మాషాంతకుల) ఆంగీరస వారతంతతవేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత వరతస్తుస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

వాసంతిక అర్ధనారీశ్వర శ్రేష్ఠి

70. వరుణస గోత్రము (వెలిశెట్ల-ఏలశిష్టకుల-వరుణశిల-వెలశిష్ట-వెలిశిష్ట-వసంత-శిరిశేష్ఠ-సిరిసెట్ల-ఎలిశెట్ల) భార్గవ వారుణేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత వరుణస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

సుందరి జీమూత శ్రేష్ఠి

71. వసిష్ఠస గోత్రము (వస్తిస - వస్తికుల - వస్త్రకుల) వాసిష్ఠ ఐంద్ర ప్రమధ ఆభరద్వసవ్యేతి త్ర్యార్షేయ పవరాన్విత వసిష్ఠస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్ర ( ) గుప్తోహంభో అభివాదయే.

పుష్పదామ విద్యాఖ్యశ్రేష్ఠి

72. వామదేవస గోత్రము (ఉపలాలకుల - ఉపమకుల - ఉపనుకుల - ఉపన - ఉపమన్య) ఆంగీరస బృహదుక్థ వామదేవేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత వామదేవస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

భీమాంభ పృధ్వీశ్రేష్ఠి

73. వాసుదేవస గోత్రము (భీమశిష్టకుల-భీమశిల-భీమశ్రేష్ఠకుల) భార్గవ వాసుదేవేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత వాసుదేవస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

విదురాంబ మాధవ శ్రేష్ఠి

74. వాయవ్యస గోత్రము (మంగమకుల - ప్రకశిష్ట - ప్రకాలకుల - ప్రక్కాల - ప్రంగమకుల - ప్రంగమూల - మంగమ) ఆంగిరస హయగ్రీవ వాయవ్యేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత వాయవ్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

రాజ్యలక్ష్మి ద్రవిణరాజశ్రేష్ఠి

75. వాల్మీకిస గోత్రము (శుశాలకుల-సకాళ్ళ-శాంతికుల-శాంతకుల-సుశాల-సుసాలకుల-సురసాల-సుశోళ్ల-సాంతాల) భార్గవ వాల్మీకేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత వాల్మీకిస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

సత్యవతి సత్యసంధ శ్రేష్ఠి

76. విశ్వక్సేనస గోత్రము (విపరిశెట్ల-ఉవరిశిష్ట-విపరిశిష్ట-విబిలిశెట్ల-పరిశిష్ఠ-యిపరిశిష్ట) భార్గవ విష్వక్సేనేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత విష్వక్సేనస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంభ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

మేదాంబ వీరభద్రశ్రేష్ఠి

77. విశ్వామిత్రస గోత్రము (విరమశిష్ఠ-విక్రమశిష్టకుల-విమరశెట్ల) వైశ్వామిత్ర మాధుశ్చందస అఘమర్షణేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత విశ్వామిత్రస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే..

గంగాభవాని విధ్యాధర శ్రేష్ఠి

78. విష్ణు వృద్ధస గోత్రము (పిప్పల-పుష్పాల-పుష్పాలకుల) అంగీరస పౌరకుత్స త్రాసదశ్వేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత విష్ణువృద్ధస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబసూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

మణిశలాక కందర్ప శ్రేష్ఠి

79. వైరోహిత్యస గోత్రము (వసంతకుల) భార్గవస వైరోహిత్యేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత వైరోహిత్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

పద్మావతి పద్మనాభ శ్రేష్ఠి

80. వ్యాసస గోత్రము (ధనదకుల-ధనగుకుల-ధేనుకుల-ధనగుండ) భార్గవవ్యాసేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత వ్యాసస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

ధనవతి ధర్మాఖ్య శ్రేష్ఠి

81. శరభంగస గోత్రము (క్రమశిష్ట-కాశెట్ల-క్రమశ్రేష్ఠకుల) భార్గవ శారభంగేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత శరభంగస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

అబ్జముఖి జమదగ్ని శ్రేష్ఠి

82. శార్ఙ్గరవస గోత్రము (గుండక కుల-గొండక-గుంటకుల-గుండుకుల) భార్గవ శార్ఙ్గరవేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత శార్ఙ్గరవస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

లీలావతి జనార్దన శ్రేష్ఠి

83. శాండిల్యస గోత్రము (తుప్పాలకుల) భార్గవ శాండిల్యేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత శాండిల్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

దంతవతి అమృతాఖ్య శ్రేష్ఠి

84. శ్రీవత్సస గోత్రము (చిలకుల - స్త్రీలకుల - శ్రీరంగకుల - శ్రీలకుల) భార్గవ చ్యావన అప్నువానేతి త్ర్యార్షేయ ప్రవరాన్విత శ్రీ వత్సస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

రాగమంజరి రాగాఖ్య శ్రేష్ఠి

85. శ్రీధరస గోత్రము (శిరిశెట్ల-సిరిశెట్ల-శిసిశిష్టకుల-శిరిశిష్ట-శిరిశెష్టకుల-శ్రీశిష్ట) భార్గప శ్రీధరేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత శ్రీధరస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

ఉత్పలాక్షి పండితార్యులు

86. శుక్లస గోత్రము (శ్రీశాలకుల-శిరిసాల-శిరసాల-సూసాల-శిరిసోళ్ల-శిరపిల్ల-సిరిపిళ్ల) భార్గవ శుక్లేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత శుక్లస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే..

రాజముఖి రాజేశ్వర శ్రేష్ఠి

87. శౌచేయస గోత్రము (ఇలమంచికుల-యలమంచి-ఎలమంచి-హేలమంచికుల) భార్గవ కృష్ణ ద్వైపాయనేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత శౌచేయసగోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

దావని నిర్జలసేన శ్రేష్ఠి

88. శౌనకస గోత్రము (కమలకుల-శౌనక-తృకశిష్టకుల-ధనదకుల-శనకాల-సనశెట్ల) భార్గవ శౌనకేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత శౌనకగోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆస్తంబ సూత్రః ( )

గుప్తోహంభో అభివాదయే.

సమశీల సకలాఖ్య శ్రేష్ఠి

89. సత్యన గోత్రము (అందిరకుల-చింతకుల-న్యందికుల-అదినకుల-చింతమశిష్ట-చింత్యకకుల-చింతాల) అంగిరస సాత్యవ్రత సాత్యేతిత్ర్యార్షేయ ప్రవరాన్విత సత్యస గోత్రః యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

చిత్రభాషిణి చిత్రశుభశ్రేష్ఠి

90. సనకస గోత్రము(శనగకుల-శానకుల-శనకుల-సానకుల-సనకాల-సనకుల) ఆంగిరస శాకల్య సానకేతిత్ర్యార్షేయ ప్రవరాన్విత సనకసగోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

పల్లవాంబ మల్లాఖ్య శ్రేష్ఠి

91. సనత్కుమారస గోత్రము (డంకారకుల-తంకారకుల-ముద్దుకుల) భార్గవ సనత్కుమారేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత సనత్కుమారస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆవస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

పద్మగంధి బాలభాను శ్రేష్ఠి

92. సనందనస గోత్రము (సమశిష్టకుల-సోమశిష్ట-సంశట్ల) భార్గవ సనందనేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత సనందనస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

మోహిని పవిత్రపాణి శ్రేష్ఠి

93. సంవర్తకస గోత్రము (రెంటకుల-రోంటకుల-రెంటుకుల) భార్గవ సంవర్తకేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత సవర్తకస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

కృష్ణాంబ నాగాహ్వాయ శ్రేష్ఠి

94. సుకాంచనస గోత్రము (పుచ్చకుల-పొచ్చకుల-పుచ్చకశిల-పొత్సుకుల-పొష్యకుల-పునీత) భార్గవ సొకాంచనేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత సుకాంచనస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

మేదాంబ మార్కండేయ శ్రేష్ఠి.

95. సుతీక్ష్ణసగోత్రము (దంతకుల-ద్యంత-ద్వంత-దెంతకుల-దేవిశెట్ల-దొంతకుల) ఆంగిరస ద్వాంత సౌతీక్ష్ణేతిత్ర్యార్షేయ ప్రవరాన్విత సుతీక్ష్ణస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

జాహ్నవి జమదగ్ని శ్రేష్ఠి

96. సుందరస గోత్రము (ఇనకాల-వెనకాల-ఇనకుల-ఇనకోల-వినకాల-వినుకుల-యినకాల) ఆంగిరస సౌందర్యేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత సుందరసగోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

ఇందుముఖి విద్యాఖ్యశ్రేష్ఠి

97. సువర్ణస గోత్రము (ప్రోడయాచకుల-ప్రొఢశిల-ప్రొథయాజ) భార్గవ సౌవర్ణేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత సువర్ణస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తో హంభో అభివాదయే.

ప్రోల్లాసిని పుణ్యరాశి గుప్త

98. సుబ్రహ్మణ్యస గోత్రము (చందనకుల-చంద-స్నిగ్ధకుల) భార్గవ సౌబ్రహ్మణ్యేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత సుబ్రహ్మణ్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

పద్మాక్షి మేఘసేన గుప్త

99. సౌపర్ణస గోత్రము (బుధుర్కుల-బుదురకుల-బుధురుక్స) భార్గవ సౌపర్ణేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత సౌపర్ణస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

దేవాంబ భోగశ్రేష్ఠి

100. సౌమ్యస గోత్రము (హస్తకుల-హస్తికుల) భార్గవ సౌమ్యేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత సౌమ్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

చపలాక్షి సింహముఖ శ్రేష్ఠి

101. సౌవర్ణస గోత్రము (సుశాలకుల-సకాళ్ళకుల-శుకాళ్ళ-సుసోళ్ళ-సుసాలకుల) ఆంగిరస సౌవర్ణేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత సౌవర్ణస గోత్రః-యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

చంద్రాంబ జలదాఖ్య శ్రేష్ఠి

102. హరివల్క్యస గోత్రము (కపట-కురట-కోరటకుల-గోరంటకుల) భార్గవ హరివల్క్యేతి ద్వ్యార్షేయ ప్రవరాన్విత హరివల్క్యస గోత్రః - యజుశ్శాఖాధ్యాయీ ఆపస్తంబ సూత్రః ( ) గుప్తోహంభో అభివాదయే.

ధరణీదేవి కుమార శ్రేష్ఠి

# గర్భాదానాది పంచదశ సంస్కారములు చేయుకాలము

**గర్భాదానము :** స్త్రీలకు రజోదర్శనము మొదలు పదునారు రాత్రులు ఋతురాత్రులనబడును. ఈ పదునారు దినములలో ఆదినాల్గు రాత్రులును, పదునొకొండవ మూడవ రాత్రులు నీయారు రాత్రులును నిందితములనియును, నితరములగు పదిరాత్రులుత్తమంబులుగాన నీ పది దినంబులోను, రోహిణి, మృగశిర, పునర్వసు ఉత్తరాఫల్గుణి, హస్తమి, చిత్ర, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ట, శతభిషం, ఉ.భాద్రలలోను మరియు పురుషరాసులగు మేష, మిధున, సింహ తులాధనః కుంభ లగ్నముల యందైన వీటి షడ్వర్గులయందైనను, బృహస్పతి లగ్నపంచమ స్థానములలో నుండగాను, లగ్నములను పురుషగ్రహములు చూచుచుండగను లేకున్న లగ్నములో నుండగను, లగ్నమును పురుషగ్రహములు చూచుచుండగను లేకున్న లగ్నములో నుండగను, సోమ, బుధ, గురు, శుక్రవారములయందును, ఉభయపక్ష ద్వితీయ, తృతీయ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిథులయందును, గర్భాదాన సంస్కారము చేయవలయును.

**పుంసవనము :** తొలుత గర్భము గలిగిన వనితకు మూడవ మాసమందును. అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ మూల ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిష, ఉత్తరాభాద్ర, రేవతి, ఈ నక్షత్రములయందును, వృశ్చిక సింహ రాసులుగాక ఇతర రాసులయందును, చవితి, నవమి, చతుర్థశి, అమావాస్యాల బరిత్యజించి తక్కిన శుభ దినముల యందు గర్భమునకు శుభము కలుగుటకై పెనిమిటైనవాడు పుంసవనమనేది కర్మచేయవలయును.

**సీమంతము :** పుంసవ విషయమున చెప్పిన మాసక్రమము దప్ప తక్కిన దినవార నక్షత్రాదులు సీమంతమునకును గ్రాహ్యంబులు, మాసవిషయమై ఆరు నాల్గువెనిమిదవ మాసములయందు పంచమాష్టమ ద్వాదశములయందు 'సూర్యాంగారక' శని రాహు కేతువు క్షీణ చంద్రాది పాపగ్రహములు లేక యుండగా చంద్రుడు లగ్నమునందు లేక యుండగాను నవమ శుద్ధిగల లగ్నమునందు సీమంతము జేయవలయును.

**జాతకర్మ :** పుత్రోత్పత్తి కాలమందైనను పుత్రోత్పత్తి దినము మొదలు 10వ దినముల వరకునే దినమందైనను జాతకర్మము చేయవలసినది. మరియు 11వ దినమందైనను జేయవలయును, నీ చెప్పబడిన దినములలో చేయునట్లయిన, అశ్విని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, ఈ నక్షత్రములయందును, చవితి, నవమి, పూర్ణిమ, అమావాస్య ఇవి దప్పతక్కిన తిథులయందును, సోమ, బుధ, గురు, శుక్రవారముల యందును, శుభగ్రహాధిప లగ్నములయందును, నీ లక్షణ యుక్తమైన శుభదినములలో పూర్వాహ్ణమందు జాతకర్మ జేయవలయును.

**నామకర్ణము :** పుత్రజననము కలిగిన వెంటనే నక్షత్రనామ మనగా రోహిణి నక్షత్రమందు బుట్టిన వానికి రౌహిణుడు, ఈవిధముగా నక్షత్ర నామకర్ణము రహస్యముగా జేసి 11వ దినమునందును సమానవర్ణముగల పేరు అనగా కృష్ణ, శివ, మహేశ్వర ఇట్టి వ్యవహారనామములను కూతురి విషయమే బేసి యక్షరములు గల నామములు అనగా శారద, ఇందిరా, భవానీ, జానకి మొదలగు నామములు నిశ్చయింపవలెను. ఈ నామకర్ణ విషయమై పంచాంగ శుద్ధిగల దివసములందును, రోహిణి, ఉత్తరాఫల్గుణి, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, స్వాతి, హస్త, శ్రవణ, ధనిష్ట, శతభిషం, అశ్విని, పునర్వసు, పుష్యమి, అనూరాధ, ఈ నక్షత్రములయందును, 11వ దివసమందు జేయని పక్షమున బ్రాహ్మణులు మొదలగుగా గల నాల్గు వర్ణములకు పది దినముల పర్యంతము జాతాశౌచమని విశేష వచనములుండుట వలన జాతి భేదము లేక నాలుగ వర్ణముల వారును పుట్టిన దినము మొదలు పదియారవ దినమందుగాని యిరువదవ దినమందుగానీ ఇరువది రెండవ దినమందు మాసాంతమందు చేయవలెను. మరియు యే వర్ణమున కావర్ణాధిపతి లగ్నమందుండగాను అష్టమ శుద్ధిజూచి శుభహోరలలో బ్రాహ్మణాది వర్ణమునకు క్రమముగా, శర్మ, వర్మ, గుప్త, దాసది సంజ్ఞలు నామమునకు చివర నుండునట్లుగా నామకర్ణ సంస్కారము గావింపవలెను.

**నిష్క్రమణము లేక దేవతా దర్శనము :** శిశువు జననము లగాయతు ఆరవ, మాసమందైనను లేకున్న 4,5వ మాసములలో పంచాంగ శుద్ధి గల రోజు శిశువును బయటకు తీసికపోవలయును. మరియు దేవతా దర్శనము చేయించవలయును.

**డోలారోహణము :** శ్లో॥ ఆందోలా రోహణే పుంసో ద్వాదశోదివస శ్శుభః త్రయోదశస్తుకన్యాయాస నక్షత్ర విచారణా, అన్యస్మి దవసే చేత్సానాచ్ఛుభకాలం విచారయేత్ అనగా పుత్రునికి బంద్రెడవ దినమందును కన్యకు పదమూడవ దినమందును నుయ్యాయలలో నుంచినచో శుభ తిథ్యాదులు విచారింపనక్కరలేదు. మరియేకాలమందైనచో నదికావలెను. ఎట్లనిన, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి, హస్త, అశ్విని, రేవతి, పుష్యమి, అనూరాధ, మృగశిర, చిత్ర, పునర్వసు, శ్రవణము, స్వాతి, అను నక్షత్రములందు శుభవారమున రిక్తగాని తిథియందు చంద్రతారాబలముండునపుడు పుణ్యస్త్రీలు శిశువునుయ్యలనుంచవలయును.

**దుగ్గపానము :** ముప్పది యొకటవ రోజునైనను జన్మ నక్షత్రము రెండవ పర్యాయము దినమందైనను డోలారోహణమునకు జెప్పిన నక్షత్రములందైనను పూర్వాహ్ణ మధ్యాహ్ణములందైనను కులదేవతకు బ్రాహ్మణునికి బూజజేసి శంఖముచే నావుపాలు పోయవలెను.

**జలపూజనము :** ప్రసవించిన స్త్రీ మాసమైన పైని బుధ, సోమ, గురు, వారములందు రిక్తగాని తిథియందు శ్రవణము, పుష్యమి, పునర్వసు, మృగశిర, హస్త, మూల, అనూరాధలలో నొక నక్షత్రమందు జల సమీపమునకు వెళ్ళిజలపూజ జేయవలెను. ఇక్కడ గురుశుక్రాస్తములు చైత్రపౌష మాసములు నధికమాసమును వర్జ్యములు.

అన్న ప్రాశనము : మగశిశువునకు జననము లగాయతు షష్ఠాది సమమాసములందు అనగా 6-8-10 మాసములందును స్త్రీ శిశువునకు పంచమాది విషయమ మాసములందు 5-7-9 ఈ మాసములందును, విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశియు, నీతిథులుప్రశస్తములు, అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరా, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషం, రేవతి ఈ నక్షత్రములందను సోమ,బుధ, గురు, శుక్రవారములందును ఆదివారము క్వచిత్తుగా విధింపబడినది, భద్రివైధృతి వ్యతీపాతగండాతిగండవజ్రశూలపరిఘయోగములు తప్ప మిగత యోగములందును, వృషభ, కర్కాటక, మిధున, కన్యాధనుర్మాసముల అనెడి శుభలగ్నములలోను దశమ శుద్ధి జూచి ముహూర్తము నిర్ణయింపవలయును. విష్ణు శివ చంద్రార్క దిక్పాల భూమి దిగ్బ్రాహ్మణులను పూజించి తల్లి తొడపై గూర్చున్న శిశువునకు కాంచన పాత్రయందుగాని కంచు పాత్రయందు పెరుగు తేనే నేయి గలిపిన కొంచెము పాలతో జేసిన పాయసము (బెల్లము వేయనిది) సువర్ణముతో గూడి తన హస్తముచే మంత్రమాత్రజలముచేవండిన అన్నము తినిపించవలెనని చె్పబడినది. ఇక అన్న ప్రాశనాంతమందు జేయవలసిన కృత్యము.

శ్లో॥ "అద్రతోథ పరివ్యస్య శిల్ప వస్తూని సర్వశః శస్త్రాణి చైవ వస్త్రాణి తతః పశ్యేత్త లక్షణం, ప్రథమం యత్స్పృశేద్బాలః స్వయంతథా, జీవికా తస్య బాలస్య తేనైవతు భవిష్యతి" అనగా నపుడు చిత్రమైన నగలు బట్టలు కత్తులు పుస్తకములు మొదలైనవి శిశువునెదుట నుంచి లక్షణము చూచునది. ఎల్లనిన, బాలుడే మొదటనే వస్తువును ముట్టనో యా వస్తుచే జీవికయగుననియూహించవలయును. అన్నప్రాశన సంస్కారములు చేయునపుడు మలమాస శుక్రాస్తాది దోషములేదని జెప్పబడినది. ఆదియు, శుద్ధకాలమున సంభవించినపుడని తెలియవలెను. కనుక ఆరవ మాసమందట్టి దోషమున్నచో నష్టము మాసమందు జేయవలెను.

అన్నప్రాశన లగ్న స్థితి గ్రహఫలం : అన్న ప్రాశన లగ్నమందు సూర్యుడుండిన చిన్నవాడు కుష్ఠురోగయు క్షీణి చంద్రుడుండిన అన్నదాతయును, బృహస్పతి యుండిన మిక్కిలి భోగవంతుడును, శుక్రుడుండిన దీర్ఘాయువుగలవాడును, శనియుండినవాతరోగముతో గూడిన శరీరము కలవాడును. రాహుకేతువులుండిన మిక్కిలి దరిద్రుడౌను, గాన పై శుభాశుభములను గుర్తించి ముహూర్తము నిశ్చయించ వలయును.

కేశఖండనము : మగశిశువుకు జననము లగాయతు సరినెలలైన 2-4-6-8-10 నెలలందున, ఉభయులకుఉత్తరాయణంలో అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్ర, స్వాతి, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, రేవతి ఈ నక్షత్రములందును. సోమ, బుధ, గురు, శుక్రవారములలోను, తదియ, అష్టమి, త్రయోదశి, అమావాస్య వినా మిగతా తిథులందును శుభగ్రహస్థిత లగ్నములలో అష్టమ శుద్ధిజూచి కేశఖండనము ముమూర్తము నిర్ణయించవలయును.

అక్షరాభ్యాసము : శిశువు జననము లగాయతు 5వ సంవత్సరములో ఉత్తరాయణనరిక్తానాధ్యాయ తిథులు వదలి అనగా చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, ఉభయపాడ్యాష్టములు అనాధ్యయ తిథులు చవితి, నవమి, చతుర్దశి రిక్త తిథులు కావున వీటిని వర్జించి గురు, శుక్రవారములందు, అశ్విని, హస్త, చిత్ర, స్వాతి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, శ్రవణము, ధనిష్ఠ, శతభిషం, మూల పూర్వత్రయ నక్షత్రములందును, అష్టమ శుద్ధి గల లగ్నములలో విద్యాచక్రశుద్ధి జూచి శ్రీ శివాయనమః యిత్యాద్యక్షరముల నభ్యసింపజేయవలయును.

విద్యా చక్రము : శ్లో॥ విద్యారంభేర్కభాత్రీణి, మృత్యురైస్యాద్భయంతథః
పరతోనఖతుల్యాని, భావివిద్యాప్రదానిచ ॥

సూర్య సంచారస్థిత నక్షత్రము మొదలు 3 నక్షత్రముల వరకు విద్య నభ్యసించిన మరణప్రదము, పిమ్మట 4 నక్షత్రములు, భయప్రదము, పిమ్మట 20 నక్షత్రములు విద్యాప్రదమని భావము.

| | | |
|---|---|---|
| 3 | 4 | 20 |
| మృత్యు | భయం | విద్యా |

కర్ణవేదము : శిశువు జననములగాయతు పండ్రెండవ దివసమందైనను పదునారవ దివసమందైనను, పగటియందును, కర్ణవేధ లగ్నమునకు ఎనిమిదవ యింటనే గ్రహములు లేక యుండగా చెవులు కుట్టవలయునది. ఈ చెప్పబడిన కాలముల నతిక్రమించినను 6-8-9, ఈ నెలలయందును, సోమ, బుధ, గురు, శుక్రవారములందును, వృషభ, మిథున కర్కాటక, కన్యాధనుర్మీన లగ్నములందును. చవితి, నవమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య ఉభయాష్టములు. సంక్రమణములునివి తప్ప తక్కిన తిథులందును. మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త ఉత్తరాత్రయము శ్రవణ, ధనిష్ఠ, రేవతి నక్షత్రములు శుభప్రదము.

చౌలకర్మ : కుమారుడు జన్మించినది లగాయతు మూడు లేక ఐదవ సంవత్సరమందైనను శుక్ల పాడ్యమి, చవితి, నవమి, చతుర్దశి, ఉభయాష్టములు, పూర్ణిమ, అమావాస్య, సంక్రమణములు వీనిని నిషేధించి యితరములైన తిథులయందును, వృషభ, మిథున, కర్కాటక, కన్యా ధనుర్మీనముల నేడు శుభాధిపలగ్నములందును, శుభాంశలయందును, రోహిణి, ఉత్తర, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ఈ నక్షత్రములలో చౌలకర్మకు మధ్యమములు. కనుక అశ్విని, మృగశిర, పునర్వసు,

పుష్యమి, హస్త, చిత్త, శ్రవణ, ధనిష్ట ఈ యుత్తమ నక్షత్రములందు ననుకూలింపని పోమున మధ్యమ నోత్రములందైనను అష్టమ వుద్ధిగల లగ్నమందు చౌలకర్మ జేయవలయును.

**ఉపనయనము :** బ్రాహ్మణులు గర్భ సంవత్సరము లేక జనన సంవత్సరము మొదలుకొని నెనిమిదవ సంవత్సరమందు వసంత ఋతువులో వర్ణేశాధిపతి మరియు ఉపనయనము చేయు సంవత్సరాధిప బృహస్పతి బలమును చూడదగినది. ఈ వర్ణేశాదులకు మూఢబాలవృద్ధత్వములు లేకయు ఉండగాను నీ గ్రహములే తమతమ మూల త్రికోనములందును నుచ్చస్థానములందును స్వక్షేత్ర మిత్రక్షేత్రములందు నుండగా చైత్ర వైశాఖ మాసములలో బుధ గురు శుక్రవారములలోను, అనూరాధ, రేవతి, అశ్వని, మృగశిర, ఉత్తరా, ఉత్తరాషా, ఉ.భాద్ర, పునర్వసు, పుష్యమి, శ్రవణము, ధనిష్ట, శతభిష, హస్త, చిత్త, స్వాతి, రోహిణి, ఈ 16 నక్షత్రములందును, శుక్ల పోమున విదియ, తదియ, పంచమి, దశమి, ఏకాదశి, కృష్ణపక్షమున విదియ, తదియ, పంచమి, ఈ తిథులయందును, చంద్రుడు స్వకీయాంశమందునుండగా, స్వాంశమైన కర్కాటమందుంఇ బుధ, గురు, శుక్రుల అంశలను పొంది యుండగాను, శ్రవణ, పునర్వసువుల నాల్గుపాదమందు యుండగాను, చంద్రుడు లేని లగ్నమందును, అష్టమ శుద్ధి గల లగ్నములలో పూర్వాకాలమున ఉపనయన సంస్కారము చేయవలయును. క్షత్రియులకు 11వ సంవత్సరముందు గ్రీష్మర్తువులోను, వైశ్యులకు 12వ సంవత్సరమందు శరదృతులోను, నీ విధముగా నిర్ణయింపబడిన ఋతువులందును మాఘాది పంచమాసములలో వర్ణేశాధిపతుల బలము చూచుకొని ఉపనయన సంస్కరము జేయవలయును. వర్ణేశ బలమనగా బ్రహ్మణులకు బృహస్పతి బలమును, క్షత్రియులకు సూర్య బలమును, వైశ్యులకు చంద్రబలమును, మరియు వేదాధిప బలమనగా ఋగ్వేదమునకు గురు, యజుర్వేదమునకు శుక్రుడును, సామవేదమునకు అంగారకుడును, అథర్వణ వేదమునకు బుధుడును, వీరలీక్రమమున వేదాధిపతుల నబడుదురు, ఉపనయన విషయమై స్వకీయవేదాధిప బలమును వటువు యొక్క జన్మలగ్నాధిపతి బలమును, ఇది ముఖ్యముగా నుండవలెను.

**ఉపనయన లగ్న కేంద్ర స్థిత పాప గ్రహఫలము :** ఉపనయన లగ్నమందు చంద్రుడున్నను మరియు ఉచ్ఛస్థానమందున్నను, వటువును రోగవంతునిగా జేయును, ద్వాదశమందు సూర్యుడుండి అంగారకునిచే చూడబడిన వటువు తండ్రి అంధుడగును, లగ్నమునకు చతుర్థ సప్తమ దశమ స్థానములు కేంద్రస్థానములు ఈ కేంద్ర స్థానములందు సూర్యుడుండిన స్పుజిత దోషము. ఈ దోషము వటువునకు మరియు తండ్రికి మారకము, అంగారక శనులుండిన రుధిర దోషము, ఈ దోషము స్వగోత్రజులకు మారకంబు, రాహువుండిన సుగ్రమ దోషము. ఈ దోషము వటువు తండ్రికి మారకంబు. చంద్రుడు సింహరాశిలో యుండగా ఉపనయనము గావించినచో వటువు పాపవంతుడగును, కార్కటకయందున్న దరిద్రుడును మేష వృశ్చికరాసులందున్న నాయుధధరుడును, కన్యమిధునరాసులందున్న పండితుండును, ధనుర్మీనములందున్న సోమయాజియును, వృషభతులారాసులందున్న శ్రీఘ్ర వివాహవంతుడును, మకర కుంభ రాసులందున్న ఆండాల సేవకుడును. ఈ రీతిగా చంద్రుడు మేషాద రాసులందుండగా ఉపనయనమైన వటువు ఆయారాశికి సంబంధించిన ఫలములును పొందును. గాన పైవాటి నన్నింటిని జాగ్రత్తగా విమర్శించి ఉపనయన ముహూర్తము నిశ్చయించవలయును.

**నోటు :** ఉపనయన విసమై స్వకీయ వేదాధిపతి బలమును వటువు యొక్క జన్మలగ్నాధిపతి బలమును జన్మవారాధిపతి బలమును, ఇవి ముఖ్యముగా జూడవలెనని ముందు చెప్పియుంటిమి. ఈ జెప్పబడిన మూడు బలములు ఏకకాలమందు దొరకుట దుస్తరము కాబట్టి బుధుడు స్థానాది షడ్బలములతో గూడి ఉపనయన లగ్నమందుండిన లక్షదోషములను బోగొట్టును, శుక్రుడు రెండు లక్షల దోషములను బొగొట్టును, పంచేష్ఠిక బలము గలదైనచో పదిలక్షల దోషములను బొగోట్టును, పంచేష్ఠికమనగా కాలధిపోలగ్నపతిర్గురుశ్చిత్రయేష్ఠకర చంద్రబలం చతుర్థకం, పంచేష్ఠికం చేతి సహస్రరశ్మినర్నిరీక్షితం పంచమలేనశష్టమ్, లగ్నాధిపతి ఉభయ స్థానములు తృతీయ, షష్టేకాదశ స్థానములయందులండిన రెండు లక్షల దోషములను హరించును, సూర్యంగారకరశనైశ్చరులలో ఏ గ్రహమైన బలయుక్తమై లగ్న తృతీయ షష్టైకాదశ స్థానములందిండినను 2 లక్షల దోషములను హరించును సూర్యుడు లగ్నములకు ఏకాదశస్థానములో నున్న సర్వదోషములను బోగొట్టును.

**సమావర్తనము :** నాలుగు వేదములు శిక్షవ్యాకరణము మొదలైన షడంగములను జదివి, గురువాజ్ఞడసి మేష కర్కాటక తులామకర రాసులను ప్రతిపద, ఉభయాష్టకములను 'పంచ' వంచపర్వములను త్రిద్యుస్పృక్, అమావాస్య వీని విడిచి పగటి పూరవ్యయమునందును సోమ, బుధ, గురు, శుక్రవారములందును, చిత్త, అనూరాధ, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, ఉత్తషా, ఉ.భా., రేవతి ఈ నక్షత్రములందును. సమావర్తనము చేయనగును.

**వివాహ విషయములు :** వధూవరుల జన్మరాశ్యాదిగా ద్వితీయ, పంచమ, నవమ, ఏకాదశ స్థానములలో గురువుండగాను, మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, మార్గశిర మాసములలో గురు శుక్రాస్తాదికములు లేకుండ చూచుకొని శుక్లపక్ష విదియ, తదియ పంచమి, సప్తమి, ఈ తిథులయందును, బుధ, గురు, శుక్రవారములలోను రోహిణి, మృగశిర, మఘ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందును, పాప క్రాంతిలేనది గమనించియు వ్యతీపాత వైధృతి, దగ్ధమృత్యుయమ కంటకాది యోగములు లేని దినమందు, భద్ర విషఘటికాదులు లేని సమయమున సూర్య, చంద్ర, శన్యాంగారకులు లేని లగ్నమందును, వివాహచక్రములలోను, ప్రభాత నిశీథ అపరాహ్ణకాలముల వర్జించి ఏక వింశతి మహాదోషరహితమైన ముహూర్తమున వివాహము జేయనగును.

**కుజాష్టమ భృగుషట్కము :** వివాహ లగ్నమునకు అంగారకుడు అష్టమ స్థానమందున్న కుజాష్టమ దోషమనబడును. షష్ఠస్థానమందు శుక్రుడుండిన భృగుషట్క దోషము ఈ రెండు దోసములు మృత్యుప్రదము.

**చంద్రషష్టారిష్ట దోషము :** వివాహ లగ్నమునకు 6-8-12 స్థానములలో నుండిన రిష్పా ష్టారిగ చంద్రనామక దోషము. ఈ దోషము దంపతులకు మృత్యుప్రదము. చంద్రుడు శుభగ్రహములతోగాని పాప గ్రహములతోగాని కూడా యున్నచో ఈ గ్రహదోషము దోసము దంపతులకు నిధన ప్రదము.

**వివాహమునకు త్రిజ్యేష్ట విచారము :** జ్యేష్ఠవరుడు జ్యేష్ట కన్యా జ్యేష్ఠ మాసము ఈ మూటిని త్రిజ్యేష్టమని పేరు వీనిలో నొక జ్యేష్ఠ శుభము రెండు మధ్యమము, మూడు జ్యేష్ఠములు హానికలుగునని వరహాసంహితయందు కలదుగాన జ్యేష్ఠవరుడు, ద్వితీయాది గర్భజాత కన్యకకు జ్యేష్ఠకన్యాద్వితీయాది గర్భజాతుడగు వరుని జ్యేష్ఠమాసమందు పెండ్లాడుట శుభకరమని పరాశరులు చెప్పియున్నారు. కావున ముఖ్యముగా త్రిజ్యేష్టములు వర్జింపవలయునని భావము. అనగా జ్యేష్ఠమాసములో జ్యేష్ఠ నక్షత్రమున జన్మించిన వరునకేగాని జ్యేష్ఠమాసము కూడదు.

**ఏకోదర వివాహాది విచారము :** ఒక వరునకు నిరువురన్నదమ్ముల కన్యియల నివ్వకూడదు. అన్నదమ్ములకు అక్కచెల్లండ్రనియ్యకూడదు. ఏకలగ్నమందు భిన్నోదరులనగా సవతి తల్లి కుమారులకు ఇరువురు కన్నియల నీయగూడదు. సోదరులకిద్దరికి ఏకకాలమందు ఉపనయనము గాని వివాహముగాని చేయకూడదు. మరియు ఒకరికి వివాహము ఒకరికి ఉపనయనము ఒకే గృహములో ఏక కాలమందు చేయరాదు. కానీ అపత్కాలమందు మాసాంతరమున చేయవచ్చుననియు మరియు మన్వాదులు లగ్నాంతరమున జేయవచ్చుననియు, కొందరు ఏకలగ్నమందు అంశభేదమైన అన్యాగ్రమందు చేయవచ్చుననియు, కొందరు బుత్రిక వివాహానంతరము పుత్ర వివాహము చేయవచ్చుననియు, కవలలకు ఏక కాలమందే చేయవచ్చుననియు చెప్పియున్నారు. కానీ పుత్ర వివాహానంతరము పుత్రిక వివాహము పుత్రోపనయనము చేయకూడదు. పుత్రికా వివాహానంతరము పుత్రోపనయనము శుభకరము, ఏకోదరులకు షణ్మాసములలో వివాహము చేయకూడదు. అటుల జేసిరేని మూడు సంవత్సరములలో విధవయగును. ఏకగర్భజనితులకు స్త్రీలకు ఆరు మాసములలోగా వివాహము గూడదు. చేసినచో ఆరు సంవత్సరములలోగా భార్య హీనురాలగును. పుత్ర వివాహము చేసిన పిమ్మట ఆరు మాసాలలోగా ఏకోదరులకు ఉపనయన వివాహోదులు చేయవచ్చునని పెద్దలు వచించియున్నారు.

**వివాహ ముహూర్తనవాంశ ఫలము :** మేసాంశ యందు వివాహమైన కన్య విధయగును. వృషభాంశయందు పశువృద్ధి, మిథునాంశయందు ధనవతియు, కర్కాటకాంశయందు వ్యభిచారిణియు, సింహాంశయందు విధవయు, కన్యాంశయందు మంచి గుణవతియు, ధనవతియు తులాంశమయందు సుపుత్రవతి, వృశ్చికాంశయందు దరిద్రురాలును, ధనురాంశపూర్వభాగమున ధనవంతురాలగును. పర భాగమందు వ్యభిచారణి, దురాచారవతియు, మకరాంశయందు విధవయు, కుంభాంశయందు రోగవతియు, మీనాంశయందు, విధవయు మరియు పుత్రహీనురాలును దరిద్రురాలుయగును. "లగ్నన్నవాంశోబలీ" అనగా లగ్నమున కంటే నవాంశము బలవత్తరమని చెప్పుట వలన ఇందు వ్రాయబడిన అశుభ ఫలన వాంశాదులను వర్జించి శుభనవాంశము యందు వివాహముహూర్త నిశ్చయించవలెను.

**నూతన వదూనివాస దోషము :** నూతన వివాహితయై ప్రథమ జ్యేష్ఠమాసమందు భర్తను, అధికమాసమందుండేనేని తన భర్తను ఆషాఢ మాసమందు అత్తగారిని పుష్యమాసమందు మామగారిని, క్షయమాసమందు తన శరీరాన్ని నశింపజేయును. ఇట్లే ప్రథమ చైత్రమాసమందు తన తండ్రి యింటిలో నుండిన తన తండ్రిని నశింపజేయును. "తేషామభావే భయంనాస్తి". వారు లేనిచో భయము లేదు.

**తిథి నిర్ణయము :** దినమానమును 5 భాగములు చేయగా ఆ ఐదింటిని ప్రాంతః సంగమ, మద్యాహ్న అపరాహ్ణ, సాయంకాలములని పేర్లు తిథి మధ్యాహ్నము నతిక్రమించి అపర్ణాహమున వ్యాపించి యుండునో ఆ తిథి పితృ కార్యములకు ముఖ్యము. ఒకే తిథికి రెండు దినముల యందపరాహ్ణ వ్యాప్తి కల్గినపుడే దినమున అపరాహ్ణమున అధిక వ్యాప్తి గలదో ఆ దినము ముఖ్యము రెండు దినములయందపరాహ్ణమున సమానముగా వ్యాపించినపుడు తిథి క్షయమునందు పూర్వ దినమును వృద్ధియందు పరదినమును ముఖ్యము రెండు దినములలోనూ అపర్ణహవ్యాప్తిలేనపుడు సాయంకాల వ్యాప్తి కల్గిన పూర్వదినము ముఖ్యము.

**తారాబలమును చూచు క్రమము :** తన జన్మ నక్షత్రము మొదలుకొని నిత్యనక్షత్రము వరకు లెక్కపెట్టి 9 చే భాగించగా మిగిలిన శేషము 1. జన్మతార 2. సంపత్తార 3. విపత్తార 4. క్షేమతార 5. ప్రత్యక్తార 6. సాధన తార 7. నైధన తార 8. మిత్ర తార 9. పరమ మిత్ర తార అగుచున్నవి. తారలలో 2,4,6,8,9 తారలు మంచి ఫలమును 1,3,5,7 తారలు దుష్ట ఫలమును ఇచ్చును.

**చంద్రబలము చూచు చక్రము :** తన జన్మరాశి మొదలు చంద్రుడున్న రాశి వరకు గణన చేయగా 1,3,6,7,10,11 రాసులయందు చంద్రుడుండగా ధనలాభము, కార్యసిద్ధి శుభము నిచ్చును. మిగత రాసులయందు కార్యవిఘ్నము గలుగును. విశేషముగా శుక్లపక్షమున 2,5,9 రాసులయందును, కృష్ణపక్షమున 4,9,12 రాసులయందును ఉండగా తల్లి కుమారుని రక్షించునట్లు చంద్రుడు మనలను రక్షించును. శుక్ల పక్షమున చంద్రబలమున్ను కృష్ణ పక్షమున తారాబలమున్న ముఖ్యముగా చూచుచుండవలయును.

**గోచార ఫలం తన జన్మరాశి మొదలు గ్రహమున్న రాశి వరకు లెక్కింవలెను.**

రవి : 3,6,10,11 రాసుల యందుండగా రాజకీయములందు జయం కలుగును.
చంద్ర : 1,3,6,7,10,11 రాసుల ఉండగా సర్వకాలములో శుభము నిచ్చును.
కుజ : 3,6,10,11 రాసుల శరీరారోగ్య భూలాభం, శత్రుజయం కలుగును.
బుధ : 2,6,7,8,10,11 రాసుల శుభం, జ్ఞానం, తెలివియనిచ్చును.
గురు : 2,5,7,9,11 రాసుల ధనం, సంతానం, శుభములు ఇచ్చును.
శుక్ర : 1,2,3,4,5,6,8,9,10,12 రాసుల కళత్ర సుఖం, మృష్టాన్న భోజనం
శని : 3,6,11 రాసులు వుండగా కార్యసిద్ధి శత్రుజయం, ఆరోగ్యం, బంధువృద్ధి
రాహు,కేతు : 3,6,11, రాసులు వుండగా ఇష్టసిద్ధి శత్రుజయం, మంచి లాభము కలుగును.
శని : 1-2-12 రాసులు యందుండగా ఏలినాటి శనియనియు, 8 దింట అష్టమ శని అనియు చెప్పెదరు. ఏలినాటి శని కార్యవిఘ్నం, ధనవ్యయం స్థానభ్రష్టం, బంధునష్టం చేయును. అష్టమ శని శరీరమునకు విశేష పీడను చేయును. అపమృత్యు భయమును కలుగజేయును. ఈ నవగ్రహములు పైన చెప్పిన రాసులందుగాక ఇతరరాసుల యందున్నప్పుడు కష్టఫలం, ధననష్టం, పీడ కార్యవిఘ్నము చేసెదరు.

**శూన్య మాసముల నిర్ణయము :** 1. మీన సంక్రమణతో కూడిన చైత్రమాసము 2. మిథున సంక్రమణతో చేరిన ఆషాఢమాసము 3. కన్యా సంక్రమణతో కూడిన భాద్రపద మాసము, 4. ధనుస్సంక్రమణతో చేరిన పుష్యమాసము శూన్యమాసములుగా నిర్ణయించబడినవి.

**ఏక విశంతి మహాదోషములు :** 1. పంచాంగ శుద్ధి రాహిత్యదోషము 2. సంక్రాంతి దోషము 3. పాపషడ్వర్గ దోషము 4. కునవాంశదోషము 5. కుజాష్టమదోషము 6. భృగుషట్కదోషము 7. కర్తరీ దోషము 8. అష్టమ లగ్నదోషము 9. అష్టమ చంద్రదోషము 10. షడష్టరిప్ప 11. సగ్రహచంద్ర దోషము 12. దుర్ముహూర్త చంద్రదోషము 13. ఖార్జురిస్థ సమాంఘ్రిదోషము 14. గ్రహణ దోషము 15. ఉత్పాతదోషము 16. క్రూరయుగ్మాష్ట దోషము 17. అశుభనిద్ధదోషము 18. విషయర్లగ్న దోషం 19. లగ్నాన్త దోషము 20. గండాంస్త దోషము 21. వ్యతీపాత వైధృతి మహా దోషము. ఈ దోషముల యొక్కస్వరూపమును దోషమును శాస్త్రము వల్ల తెలుసుకొనవలెను.

**గోధూళి లగ్నము :** సూర్యోదయమునకు సప్తమలగ్నము. ఇది సుముహూర్తములన్నింటికి శుభప్రదము సుముహూర్తములు కళింగదేశీయులు పశ్చిమదేశీయులచేతను ముఖ్యముగా ఉయోగించబడుచున్నది.

**అభిజిల్లగ్నము :** సూర్యోదయలగ్నమునకు నాల్గవలగ్నము అభిజిల్లగ్నము, ఈ లగ్నము సర్వ దోషములను నివారించును. సమస్త దేశములయందు సర్వ వర్ణములవారి చేతను ఉపనయనమునకు తప్పరిక్తములగు సర్వకర్మలయందును ప్రశస్తమైనదని మహా పురుషులు చెప్పుచున్నారు. దైవజ్ఞులు నిర్ణయించే శుభముహూర్తములకు లగ్నబల సంపదచే స్వల్ప దోషములు నశించును. మహాదోషములు తొలగుట గూర్చి చెప్పుట లేదు. ఈ అభిజిల్లగ్నమును గురించి శాస్త్రము "అశేష దోషాపహారం" అను ప్రమాణము వలన సర్వదోషములను నశింపచేయును. అని స్పష్టముగాన దైవజ్ఞభారము వహించలేని వారు ఈ అభిజిల్లగ్నమును సర్వశుభకార్యములందు ఆశ్రయించుట మంచిది.

**పంచక రహితము - తద్వివరము :** 1. ప్రతిపదాది తిథులను ఆదివారాది వారములను అశ్విన్యాది నక్షత్రములను మేషాదిలగ్నముల యొక్క సంఖ్యను కూడి 9 చే భాగించగా మిగిలినది పంచమకమగును. ఈ మిగిలిన శేషము 1,2,3,4,5,6,7,8 అయిన ఎడల 1. మృత్యువనియు, 2. అగ్నియనియు, 4. రాజపంచకమనియు, 6. చోరపంచమనియు, 8. రోగపంచకమనియు, చెప్పబడినవి. పై మృత్యు అగ్ని రాజ చోరపంచకములుగాక మిగత

3,5,7,9 శేష సంఖ్యలు సవ్యముగా రహితమైనదని గ్రహించవలయును.

పై చెడు పంచకములలో అనగా రహితముగాని ఐదులో 4, సంఖ్య గల రాజ పంచకము మాత్రము సర్వ కార్యములకు నిందితము కాదు. కానీ ప్రత్యేకముగా రాజకీయ వ్యవహారాదులయందు ప్రయాణ ముహూర్త న్ణియములో గ్రహించవచ్చును. ఇట్టే నూతన గృహారంభాది గృహ ప్రవేశము వరకు అగ్ని రాజ పంచకములు పగలు నిందితములు.

మృత్యుపంచకము సదానిందితము : 1. అది వార యుక్త రోగ పంచకము 2. సోమవార యుక్త రాజపంచము 3. భౌమవారయుక్త అగ్ని పంచకము, బుధ శుక్రవారములందు చోరపంచకము శనివారమున మృత్యు పంచకములు దూష్యములు.

ఈ పంచకములో అగ్ని, రోగ, మృత్యు పంచకాదుల త్యజించవలయును.

| శేషం | పంచకము | దోషము | దోషకాలం | దోషములు | దానములు |
|---|---|---|---|---|---|
| 1. | మృత్యుపంచకం | గురు,శుక్ర | అర్ధరాత్రి | స్వర్గం | |
| 2. | అగ్ని పంచకం | బుధ,శని | పగలు | గృహారంభ ప్రవేశములు | గంధపుచెక్క |
| 4. | రాజపంచకము | మంగ | పగలు | రాజోద్యాగాది కృషి | నిమ్మపండ్లు |
| 6. | చోరపంచకము | సోమ | రాత్రి | యాత్ర | పూజామణులు |
| 8. | రోగపంచకము | ఆది | రాత్రి | ఉపనయన వ్రతాదులు | దాన్యదానం |
| 3-5 | రహితములు | | | -- | -- |

## జననమందు దుష్టకాల ఫలములు

**నక్షత్రములు :** చిత్త 1-2 పాదములు, పుష్యమి 2-3 పూర్వాషాఢ 3, ఉత్తర 1, మఖ 1, రేవతి 2-3-4, అశ్వని 2-3, పాదములు అశుభప్రదములు.

**ఆశ్లేషా :** 1వ పాదము శుభము 2వ పాదము ధనహాని, 3 మాతృహాని, 4 పితృహాని, స్త్రీ పురుష శిశువులు యెవరైనను అత్తగారికి హనికలుగచేయుదురు.

**జ్యేష్ఠా :** పురుషుడైన అన్నగారికి, స్త్రీ అయిన భర్త అన్నగారికి హానిని కలుగచేయును. జ్యేష్ఠ నక్షత్రకాలమును పదిభాగములు చేసిన 1 భాగమున జననం మాతామహికి, 2 మతామహునకు, 3 మేనమామకు, 4 తల్లికి, 5 తనకు 6 గోత్రస్థులకు, 7 ఉభయకులములకు, 8 తన అన్నగారికి, 9 తనమామకు, 10 సర్వమునకు హానిని కలుగచేయును.

**మూల :** 1వ పాదమునందు తండ్రికి, 2 తల్లికి, 3 దనమునకు, 4 కులమునకు హానిని కలుగచేయును.

**స్త్రీ జననము :** మూలయందు మామగారికిని, ఆశ్రేషయందు అత్తగారికిని, జ్యేష్టయందు భర్త అన్నగారికిని, విశాఖయందు భర్త తమ్మునకు హానిని కలుగజేయును. ఈ నక్షత్రముయందు యధా శాస్త్రముగా శాంతి చేయవలెను.

మూలనక్షత్రకామును 15 భాగములు చేయగా 1. తండ్రికి, 2. పినతండ్రికి, 3. సోదరులకు, 4. పితామహికి 5. తల్లికి, 6. పినతల్లికి, 7. మేనమామకు, 8. పెద్దమామకు, 9. మామకు, 10. పశువులకు, 11. దాసిజనమునకు, 12. శిశువుకు, 13. సోదరులకు, 14. తోబుట్టువులకు, 15. జననీజనమునకు సర్వదాదోషకరముగాన శాంతి వెంటనే చేయవలయును.

**తిథులు :** కృష్ణచతుర్దశీ అమావాస్య అశుభకరములు. అమావాస్య అనునది సినీవాలీ, కుహూ, దర్శ అని మూడు విధములు నున్నది. ఈ అమావాస్య యొక్క 8 ఝాములు కాలములో (1) మొదటి ఝాము సినీవాలి చివరి 7-8 ఝాములు రెండు కుహూ, మద్యగల 5 ఝాములు దర్శ అమావాస్య యొక్క వృద్ది యందు మధ్య దినమందుగల 60 ఘడియల కాలము దర్శ,-కృష్ణ చతుర్దశీతో కూడిన అమావాస్య పూర్వకాలము సినీవాలీ,-ప్రతిపత్తులో కూడిన అమావాస్య ఉత్తర కాలము కుహూ అనియు, అమావాస్య క్షయ సమయమున అంతము దర్శ అనియు మయూఖమునందు తెలుచున్నది.

**శిశుజననము :** దర్శయందైన తల్లితండ్రులకు దారిద్ర్యము, సినీవాలీయందైన మహాదోషము, అనగా అకాలమందు తన ఇంటగల ఆవు, ఎనుము, దాసి, కుక్క, పక్షి మొదలగునవియేవి ప్రసవించిన తనకు ఇంద్రైశ్వర్యమున్నను నశింపచేయును. కుహూ యందైన సర్వబాధములు కలుగును. కావున గ్రహశాన్తి గోముఖ ప్రసవశాన్తి వెంటనే చేయవలయును. గండాన్త దోషములు మూడు విధములు 1. లగ్న గండన్తము, 2. తిథిగండాన్తము, 3. నక్షత్రగండన్తము.

**1. లగ్నగండన్తము :** 12-1 లగ్నముల యొక్కయు 4-5 యొక్కయు, 8-9 యొక్కయు సంధికాలమునందు (1/2ఒ1/2) ఒక ఘడియకాలము అశుభదాయకము.

**2. తిథిగండాన్తము :** 5-6 తిథులయొక్కయు 10-11 యొక్కయు 15-1 తిథుల యొక్కయు సంధికాలము (44) 8 ఘడియకాలము అశుభదాయకము.

**3. నక్షత్రగండాన్తము :** రేవతి అశ్వసుల యొక్కయు, జ్యేష్ఠ మూలలయొక్కయు సంధికాలము (22) 4 ఘడియలకాలము అశుభదాయకము. ఈ జ్యేష్ఠ మూలల యొక్కసంధి కలమును అభుక్త మూలము అని శాస్త్రములు చెప్పుచున్నవి. ఈ సంధికాల పరిమాణము (1/21/2) 1 ఘడియలు అని నారదుడు (44) 8 గడియలు కాలము అని కాలామృతమందు చెప్పినది.

**యోగములు :** విష్కంభము, వ్యతిపాత్, శూల, వజ్ర, అతిగండ, వ్యాఘాత, పరిఘాపూర్వార్థం, వైధృతి ఈ యోగములు అశుభదాయకములు.

**కరణములు :** భద్ర (విష్టీ అశుభదాయకము)

**విశేషములు :** సంక్రమణము, గ్రహణము విషఘడియలు, రాహుకాలము, యమగండములు, అవమాత్రిద్యుస్పృక్, వేధ, క్రాన్తి మొదలగు దుష్టకాలములందు జన్మించిన అశుభదాయకము మరియు యమల జననము, త్రికప్రసమ ప్రసవవైకృతి, సదంతజననము మొదలగు వికృతి ప్రసవములు అశుభదాయకములు ఇవి సామాన్య దోషములు.

**ఏక నక్షత్రజనన దోషము :** పితాపుత్రేక నక్షత్రే శాంతింకుర్యాద్యథావిధి తల్లి, తండ్రి, వీరల నక్షత్రమందు శిశుజననము అశుభదాయకము గాన యధాశాస్త్రముగా శాన్తి చేయవలెను. "శాన్తిర్వాపుష్కలాస్యాచ్చేత్పురి దోషోన విద్యతే' లని శాస్త్రములు చెప్పుచున్నవి గాన శాన్తి అవసరము.

ఆశ్లేష, జ్యేష్ట మూలాది నక్షత్రములయందు కొన్ని పాదములయందు దోషములేదన్నను ఉగ్రనక్షత్రములగుట చేత తప్పక నవగ్రహశాంతి చేయుట యుక్తముగా భావించవలెను.

**విశేషం :** ఉత్తరనక్షత్రమందు జన్మించిన రెండు మాసములు పుష్యమి నక్షత్రమున జన్మించిన మూడు మాసములు, చిత్రానక్షత్రమందు జన్మించిన ఆరుమాసములను, పూర్వాషాఢా నక్షత్రమందు జన్మించిన యెనిమిది మాసములను, ఆశ్లేషానక్షత్రమందు జన్మించిన తొమ్మిది మాసములను, జ్యేష్ఠనక్షత్రమందు జన్మించిన పదునైదు మాసములను, మూలా నక్షత్రమందు, జన్మించిన 8 సంవత్సరములను, తండ్రి పుత్రదర్శనము మానివేయవలయును అని కూడా శాస్త్రములు చెప్పుచున్నవి. అందుచే శాస్త్రోక్తముగా నవగ్రహశాంతి సర్వదాచేయతగియున్నది.

## ప్రథమార్తవమున దుష్టమాసాది నిర్ణయము

**1. మాసములు :** చైత్రము, జ్యేష్టము, ఆషాఢము, భాద్రపదము, కార్తీకము, పుష్యము. ఈ ఆరు మాసములు స్త్రీ ప్రథమ రజస్వలయైన అశుభదాయకము.

**2. తిథులు :** ప్రతిపద, చవితి, షష్ఠి, అష్టమీ, నవమీ, ద్వాదశి, చతుర్దశీ, పూర్ణిమ, అమావాస్య, అవమాత్రిద్యుస్పృక్, ఈ తిథులు అశుభప్రదములు.

**3. నక్షత్రములు :** భరణి, కృత్తిక, ఆర్ద్రా, పునర్వసు, ఆశ్లేష, మఖ, పూ.ఫ, పుబ్బ, జ్యేష్ట, పూర్వాషాఢా, పూర్వాభాద్రా, జ్యేష్ఠ ఈ నక్షత్రములు అశుభప్రదములు మరియు భర్తనక్షత్రము తమకు నైదవతార, భర్తకు అష్టమ చంద్రుడు అశుభప్రదములు.

**4. యోగములు :** విష్కంభ, గండ, అతిగండ, శూల, వ్యాఘాత, వజ్రము పరిఘపూర్వార్థ, వ్యతీపాత వైధృతి, ఈ యోగములు అశుభప్రదములు.

**6. కరణములు :** భద్ర (విష్టి) అశుభప్రదము.

**7. లగ్నములు :** మేషము, సింహము, వృశ్చికము, మకరము, కుంభము - ఈ లగ్నములు అశుభప్రదములు.

**8. విశేషములు :** సంక్రమణము, గ్రహణము సూర్యోదయకాలము సూర్యాస్తమయకాలము, అపరాహ్ణము, అర్ధరాత్రి, అపరరాత్రి, వర్జ్యకాలము, రాహుకాలము, యమగండకాలము, నిద్రాసమయము రాత్రి సమయము, వేధలు క్రాన్తులు, మొదలగు కాలములు అశుభప్రదములు.

**వస్త్రములు :** నీలవస్త్రము, రక్త వస్త్రము, చిత్రవస్త్రము, జీర్ణ వస్త్రము దిగంబరత్వము అశుభదాయకములు.

**10. స్థానములు :** పరగృహము, గ్రామాన్తరము, మార్గమధ్యము, అపవిత్రస్థలములు అశుభప్రదములు.

**11. సన్నివేశములు :** వస్త్రమునందు ఒకటి రెండు బిందువులు శుభప్రదము అనేక బిందువులు అశుభ ప్రదములు. కొందరు బేసి బిందువులు శుభప్రదములు. పుత్ర ప్రదములు.

## మరణ విషయమై దుష్ట నక్షత్రములు

మృగశిర - చిత్ర, 2 నెలలు, కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాఢ నక్షత్రములకు - 3 నెలలు, రోహిణి, మఘ నక్షత్రములకు - 5 నెలలు, ధనిష్ట, శతభిషం, పూర్వాభాద్రా, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములకు 6 నెలలు పై నక్షత్రములయందు మరణము సంభవించిన యెడల, ఆయా నక్షత్రమున కేర్పడిన నెలల కాలము ఇంటిని విడువవలెను శాంతి చేసి ఇంటిలో తిరిగి చేరవలెను.

కొందరి మతము, తల్లిదండ్రుల మరణము, పై నక్షత్రాదులలో గలిగిన ఇల్లు విడువ పనిలేదు. ఇది దేశాచారము ననుసరించినది. ధనిష్టకు 6 నెలలు, శతభిషమునకు 5 నెలలు, పూర్వాభాద్రకు 4 నెలలు, ఉత్తరాభాద్రకు 3 నెలలు, రేవతికి 2 మాసములు అని కొన్ని గ్రంథములలో గలదు. ఉదకశాంతి చేసి గృహములో తప్పని పరిస్థితిలో యుండవచ్చును.

**అశౌచ నిరూపణం విషయములు :** కూటస్థుని దగ్గర నుంచి యేడుగురు పురుషుల వరకు, సపిండులు, తరువాత యేడుగురు పురుషుల వరకు (14) సమానోదకులు తరువాత యేడుగురు పురుషుల వరకు (21) సగోత్రులు అనియు చెప్పుచున్నవి. మరియు - సాపిండ్యము, పురుష జనన విషయములో సప్తపురుషము - స్త్రీ జనన విషయములో త్రిపూరుషమనియు చెప్పుచున్నవి - ఈ సాపిండ్యాదుల ననుసరించియే అశౌచము ప్రవర్తించుచున్నది. అశౌచము : జాతాశౌచము - మృతాశౌచము అని రెండు విధములుగా నున్నది.

**జాతాశౌచము :** జననమందు : జ్ఞాతులందరకు పది దినములు జాతాశౌచము గర్భస్రావము మాసమున జరిగిన తండ్రికి మాత్రము స్నానము 5,6 మాసములయందు జరిగిన తండ్రి జ్ఞాతులకు స్నానము 7,8,9 మాసములయందు జరిగిన, అందరకు 10 దినములు అశౌచము.

తల్లికి : పురుషప్రసవమునందు 30 (ముప్పది) దినములు : స్త్రీ ప్రసవమందు 40 (నలుబది) దినములు అశౌచముఅనంతరము శుద్ధియగును. దీనిని నెల పురుడు అందురు. 10 దినముల వరకు - అనిరీక్ష్యత్వాది (చూడకుండుట) రూపమగు అశౌచము అనంతరము - అస్పృశ్యత (తాకకుండుట) కర్మానర్హత్వ (కర్మలకు పనికిరాకుండుట) రూపమగు అశౌచము. కుమార్తె ప్రసవించిన, మొదట పుత్రజననమైతే ఆ కుమార్తె యొక్క తల్లి తండ్రులకు 3 మూడు దినములు జాతాశౌచము.

**మృతాశౌచము :** జననము మొదలు 10 దినములలోగా శిశువు మరణించిన జ్ఞాతులకు అందరకు జాతాశౌచముతో శుద్ధియగును - మృతాశౌచము లేదు.

పది దినములకు పైన 6 మాసములకు లోగా శిశువు మరణించిన జ్ఞాతులకు స్నానమాత్రము. 6 మాసములకు పైన 3 మూడు సంవత్సరములకు లోగా శిశువు మరణించిన తల్లితండ్రులకు, జ్ఞాతులకు బాల మరణమున 1 దినమును, బాలికామరణమున సద్యాశౌచము. 3 మూడు సంవత్సరములకు పైన ఉపనయనమగు వరకు జ్ఞాతులకు త్రిరాత్రము అశౌచము, ఉపనయనానంతరము వటువు మరణించిన, తల్లితండ్రులకు భ్రాతలకు అందరు జ్ఞాతులకు దశరాత్రము అశౌచము. 3 సంవత్సరములకు పైన వివాహములోపల బాలికా మరణమునందు తల్లిదండ్రులకు భ్రాతలకు దశరాత్రాశౌచము జ్ఞాతులకు దినము అశౌచము. జ్ఞాతి (సపిండుల) మరణమునందు జ్ఞాతులకు దశరాత్రాశౌచకము.

**త్రిరాత్రాశౌచము :** శిశు జననమందును, ఉపనీతుని మరణమందుమ సమానోదరులకు మూడు దినములు అశౌచము, సగోత్రులకు అహస్సు అశౌచము, అనుపనీతుని మరణమునందు స్నానమాత్రమే. (సపిండుడు

సమానోదరుడు సగోత్రుడు మొదట వివరించబడియున్నారు.) అశౌచవిషయములో ప్రమాణము.

**దశాహేన సపిండానాం శుద్ధిస్యాత్తు త్రిరాత్రతః। సమానోదక జాతానాం, గోత్రాజానా మహస్స్మృతం॥** : భగినీపుత్ర (తోబుట్టువు కుమారుని) మరణమందు తల్లి తోబుట్టువులకు, తల్లి సోదరులకు త్రిరాత్ర పరోఓమున పక్షిణి-అనునీత మరణమునందు స్నానమాత్రము.

పినతల్లి తమ్ముడు అయిన మేనమామ అనువనీతుడైన స్నానమాత్రము. మాతామహిమతామహులయొక్క మరణమునందు దౌహిత్రులకు త్రిరాత్రము పక్షిణి. అత్త మామల మరణమందు - అల్లునకు తన భార్య జీవించియున్న త్రిరాత్రము.

**పక్షిణ్యాశౌచము : వివాహితయగు స్త్రీ కి :** 1. తల్లితండ్రి, 2. తల్లితల్లి, 3. మేనమామ, 4. ఆయన కొడుకు, 5. కూతురు, 6. తల్లితోబుట్టువు, 7. ఆమెకొడుకు, 8. కూతురు, 9. తనతోబుట్టువు, 10. ఆమె కొడుకు, 11. కూతురు 12. తనతోబుట్టినవాడు, 13. ఆయనకొడుకు 14. కూతురు, 15. తండ్రితోబుట్టువు, 16. ఆమె కొడుకు, 17. కూతురు, 18. తండ్రితోబుట్టినవారు, 19. ఆయనకొడుకు, 20. కూతురు, 21. కొడుకు కూతురు, 2. కూతురికూతరు, 23. తండ్రి తండ్రి 24. తండ్రి తల్లి.

ఈపై తెల్పిన 24 మంది యొక్క మరణమునందు వివాహితయగు స్త్రీకి పక్షిణి అశౌచము సంభవించును.

**పురుషునకు :** 1. మేనమామ కొడుకు, 2. కూతురు, 3. తల్లితోబుట్టువు కొడుకు, 4. కూతరు, 5. తండ్రితోబుట్టువు కొడుకు, 6. కూతరు, 7. తన్నతోబుట్టువు, 8. ఆమె కొడుకు, 9. కూతురు, 10. తనసోదరుని కూతురు 11 తండ్రి సోదరుని కూతురు 12 కుమారుని కూతురు 13 కూతురికూతురు.

ఈ పైతెల్పిన 13 మరణమునందు పురుషునకు పక్షిణి అశౌచము సంభవించును ఈ పక్షిణి అశౌచము వివాహితలగు స్త్రీలయొక్కయు ఉపనీతులగు పురుషులయొక్కయు మరణమునందే సంభవించును. అంతకుపూర్వమైన స్నానముచేతనే శుద్ధమొదగు, పక్షిణి అనగ అశౌచము విన్న పగలు భాగము. ఆర్తారిభాగము మరుదినము పగలు భాగము, భాగములు కలిసిన పక్షిణి లనబడును. రాత్రి విన్నను ఇటులనే రాత్రి పగలు రాత్రి మూడు భాగములు పక్షిణి అనబడును.

**ఏక శౌచము :** సవతికూతరు యొక్క మరణమునందు సవతి తల్లికి, సవతి తల్లి యొక్క మరణమునందు సవతి కూతురునకు, ఏకదినము, భిన్నోదరమాతుల మరణమునందు ఒక దినము రాజు యొక్క మరణమునందు సన్నిధానము ఒకదినము.

**అతి క్రాంతాశౌచము :** జననవిషయములో అతిక్రాన్తాశౌచములే అని చెప్పబడినది. మరణ విషయము దశాహశౌచము కలవారికి 10 దినములు అతిక్రమించిన తరువాత స్నానమాత్రము త్రిరాతాశౌచము అతిక్రమించిన యెడల ఒక దినము అశౌచము, ఏకదినాశౌచము అతిక్రమించిన స్నానమాత్రం, పక్షిణ్యాశౌచము అతిక్రమించిన దశాహమధ్యమందైన ఏకకాలము అనగా, పగలు విన్న పగలు, రాత్రి విన్న రాత్రి అశౌచము దశాహానంతరమందైన స్నానమాత్రము.

**అశౌచకసౌకర్యమందు :** జాతాశౌచకాలములో సమానపరిమాణముగల మరియు జాతాశౌచము వచ్చిన అదిపూర్వాశౌచశోషము తోడనే శుద్ధియగును మృతాశౌచకాలములో సమపరిమాణముగల మృతాశౌచము కాని వచ్చిన యెడల ఈ రెండును పూర్వాశౌచము శేషముతోడనే శుద్ధియగును.

**అశౌచకాలనిర్ణయము :** ఋతువు, జననము, మరణము రాత్రికాలముల జరిగిన నిర్ణయమార్గము సంధ్యాకాలవ్యతిరిక్తమగు రాత్రిని అనగా త్రియామము. (రాత్రిని) మూడు భాగములు చేసి మొదటి 1,2 భాగములు పూర్వదినమునకు చెందినవిగాను చివరి భాగము పరదినమునకు చెందును.

**జన్మనక్షత్రప్రకాము అదృష్ట రత్నములు (ధరించుటకు) అదృష్టవారములు అదృష్టసంఖ్యలు**

| నామ/జన్మ నక్షత్రము | అదృష్ట సంఖ్యలు | అదృష్ట రాళ్ళు | అదృష్ట వారములు | ఫలితము |
|---|---|---|---|---|
| అశ్వని | 1,4,5,9 | వైఢూర్యం | ఆది, గురు, శుక్ర | ధైర్యం, లాభం |
| భరణి | 4,6,7,9 | వజ్రం | సోమ, బుధ, గురు | స్త్రీముఖం |
| కృత్తిక | 3,4,5,9 | కెంపు | బుధ, శుక్ర, శని | అధికారం |
| రోహిణి | 1,2,3,4 | ముత్యం | బుధ, గురు, శని | మనోసుఖం |
| మృగశిర | 2,3,4,7 | పగడం | సోమ, గురు, శని | అధికారలాభం |
| ఆర్ద్ర | 2,4,5,6 | గోమేధికం | ఆది, మంగళ, బుధ | ధనలాభం |
| పునర్వసు | 1,3,4,8 | పుష్యరాగం | సోమ, గురు, శని | కీర్తివృద్ధి |
| పుష్యమి | 1,3,4,8 | నీలం | ఆది, బుధ, శని | ధనలాభం |
| ఆశ్లేష | 1,5,7,9 | పచ్చ | గురు, శుక్ర, శని | సుఖసౌఖ్యం |
| మఘ | 2,3,4,5 | వైఢూర్యం | ఆది, బుధ, గురు | కార్యజయం |
| పుబ్బ | 3,4,5,7 | వజ్రం | బుధ, శుక్ర, శని | స్త్రీసుఖం |
| ఉత్తర | 2,4,8,9 | కెంపు | బుధ, గురు, శని | స్నేహవృద్ధి |
| హస్త | 1,3,5,7 | ముత్యం | సోమ, బుధ, గురు | ధనలాభం |
| చిత్త | 2,3,4,6 | పగడం | మంగళ, బుధ, శని | శత్రునాశనం |
| స్వాతి | 3,5,7,9 | గోమేధికం | గురు, శుక్ర, శని | సుఖసంతోషం |
| విశాఖ | 3,4,6,7 | పుష్యరాగం | ఆది, సమ, మంగళ | లాభం |
| అనూరాధ | 3,7,8,9 | నీలం | బుధ, గురు, శుక్ర | ఆకర్షణబలం |
| జ్యేష్ఠ | 2,3,4,5 | పచ్చ | ఆది, బుధ, శుక్ర | వ్యాపారవృద్ధి |
| మూల | 2,3,4,8 | వైఢూర్యం | సోమ, బుధ, శని | ధనలాభం |
| పూర్వాషాఢ | 3,6,7,9 | వజ్రం | ఆది, గురు, శని | సుఖం |
| ఉత్తరాషాఢ | 1,3,5,9 | కెంపు | ఆది, మంగళ, బుధ | మనశ్శాంతి |
| శ్రవణ | 1,4,5,7 | ముత్యం | సోమ,బుధ,గురు | ధనలాభం |
| ధనిష్ఠ | 1,2,3,4 | పగడం | మంగళ, బుధ, శని | స్థిరత్వం |
| శతభిష | 2,6,7,8 | గోమేధికం | ఆది, బుధ, శుక్ర | గృహలాభం |
| పూ.భాద్ర | 3,4,5,9 | పుష్యరాగం | ఆది, గురు, శని | కీర్తిలాభం |
| ఉ.భాద్ర | 2,4,7,9 | నీలం | ఆది, సోమ, శని | అనుకూలం |
| రేవతి | 2,5,7,9 | పచ్చ | ఆది, మంగళ, బుధ | అధికారలాభం |

## కుజదోష విచారము

కుజదోషములేని నక్షత్రములు : అశ్వి, మృగ, పున, పుష్య, ఆశ్లే, ఉత్త, స్వాతి, అనూరాధ, పూషా, శ్రవణం, ఉభా, రేవతి నక్షత్రములందు పుట్టిన వారికి కుజదోషము లేదు.

జన్మలగ్నములకు : 1-2-4-7-8-12 కుజుడుండిన పురుషకుజదోషమగును. స్త్రీ పురుషులిద్దరి జాతకమునకు కుజ దోషముండిన దీర్ఘకాలం ఆయురారోగ్యములు కలిగియుందురు. మిథున కన్యాలగ్న జాతకులకు 2వ కుజదోషము, మేషవృశ్చిక, లగ్నములకు 4వ, మకర, కర్కాటక లగ్నమునకు 12వ దోషము లేదు.

జాతకమందు కుజుడు గురు, చంద్ర, బుధులతో కూడినను, చూడబడినను, కేంద్రకోణములందుండినను దోషము లేదు.

## జన్మనక్షత్రముతో చూచుకోవలసినవి.

గృహనిర్మాణ, గృహప్రవేశ, పట్టబంధ, రాజ్యాభిషేక, వ్యవసాయారంభ ఉపనయన, అన్న ప్రాశనం, భూషణధారణం, వివాహమునకు జన్మనామము చూచుకొనుట ముఖ్యము.

## నామ నక్షత్రముతో చూచుకోవలసినవి

ఊరచ్చుబాటు గ్రామార్యణము గృహపథకమునకు యుద్ధమునకు, జ్వరమునకు, వ్యవహారమునకు, ద్యూతకార్యము చేయుటకు దానం చేయునపుడు మంత్రమునందు, దేవతాపూజలందు, భూమికొన్నప్పుడు జన్మనామమున్నను పేరు మాత్రమే ప్రధానము కాని జన్మనక్షత్రము కాదు.

## జన్మనక్షత్రమందు చేయదగినవి

నిషేకము, చౌలము, త్యాగము, అన్నప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, అక్షరాభ్యాసము, పట్టాభిషేకము, చేయవచ్చును. స్త్రీలకు వివాహ శ్రేష్టము కాని జన్మతార కాదు.

## జన్మనక్షత్రమందు చేయకూడని పనులు

గర్భాదానము, వివాహం పుంసవనము, సీమంతం, ప్రయాణం, ఔషధసేవ, క్షౌరం చేయకూడదు.

## కృత్తిక విశాఖ కార్తులలో పనికివచ్చు పనులు

వివాహం ఉపనయనం మంటప నిర్మాణం, నిర్ణీత సమయమందు చేయబడు నామకరణం, పుంసవన, సీమంతాదులు, జనన, వ్యాధి, గ్రహశాంతులు యజ్ఞములు కృత్తిక విశాఖకార్తులయందు చేయవచ్చును.

కృత్తిక విశాఖలో చేయకూడనివి : చెట్లునరుకుట నూతనవస్త్రధారణము, గర్భాదానము, కత్తితో చేయుపనులు, ఓడిబియ్యం, మట్టెలు, పుట్టువెంట్రుకలు, స్తంభం కడప, వ్యవసాయారంభం, గృహారంభం, కొత్త ధాన్యం భుజించుట ఆరామ తటాక కూపములు, కొత్త బండినెక్కుట చేయగూడదు.

వర్జ్యంలో చేయదగినవి : స్నానము, దానము, జపము, నిత్యకర్మలు దేవతాపూజ, ప్రాయశ్చిత్తము, భుజించుట, యుద్ధము, మల, మూత్రవిసర్జన చేయుటకు దోషము లేదు.

వివాహానంతరము చేయగూడని పనులు : కర్ణవేధ ఉపనయనము ఉద్యాపనలు, తీర్థయాత్రలు, గంగాస్నానం, క్షౌరం, గయా శ్రాద్ధం, పిండ ప్రధానములు, ఆరు నెలలోగా మళ్ళీ వివాహాది శుభకార్యములు చేయగూడదు.

శ్లో॥ ముండనాత్ మండనం కార్యం। మండనాత్నతుముండనం ॥

ఘాతవారమందు పనికివచ్చునవి : వివాహము, ఉపనయనము, పట్టాభిషేకము, సీమంతం, జాతకర్మ, పుంసవనము, చేయుటకు దోషం లేదు.

ఘాతవారమందు చేయగూడనివి : గృహప్రవేశము, వ్యాపారారంభం,యాత్రలు, బావి త్రవ్వుట, ప్రయాణం చేయగూడదు.

జననమునకు బాలారిష్ట గ్రహములు : జన్మలగ్నమునుండి చంద్రుడు అష్టమమున, కుజుడుయేడింట, రాహువు తొమ్మిదింట, శని జన్మలగ్నమందు గురుడు మూడింట, శుక్రుడు ఆరింట, బుధుడు యేడింట, కేతువు ఆరింట, సూర్యుడు పన్నెడింట ఉన్నట్లు అయితే శిశువునకు అరిష్టము గలుగును.

జన్మలగ్నమునకు అష్టమస్థగ్రహఫలము : జన్మలగ్నమునుండి 5వ స్థానమందు సూర్యుడుండిన అగ్నిగండము, చంద్రుడుండిన జలగండము, కుజుడుండిన శస్త్రగండము, బుధుడుండిన వ్యాధి, గురుడుండిన మృత్యువు, శుక్రుడుండిన దరిద్రము, శనియుండిన తంద్రికరిష్టము గలుగును.

పుష్య నక్షత్ర ప్రశంసా :

శ్లో॥ గ్రహేణవిద్ధోప్యశుభాన్వితోపి - విరుద్ధతారోపివిలోమగోపికరోత్య వస్యం పకలార్థ సిద్ధిం - విహాయపాణి గ్రహణం పుష్యః ॥

తా॥ క్రూరవిద్ధ క్రూరాక్రాంతమై యుండినను, అశుభతారయైనను పుష్యనక్షత్రమందు చేసిన కార్యములన్ని సిద్ధించును, వివాహము వొదలి పెట్టి, సకల శుభకార్యములు జేయవచ్చును.

వివాహోపనయన విచారము : మూడు పిడీలలోపల మొగపిల్లల వివాహము చేసిన

తర్వాత 6 మాసములలో ఆడపిల్లల వివాహము చేయరాదు. మగపిల్లలు లేక ఆడపిల్లల వివాహానంతరము 6 మాసములలో ఉపనయనము, గృహప్రవేశము, ఉద్యాపనము చేయగూడదు. సంవత్సర భేదమైన చేయవచ్చును.

**వివాహమైన తదుపరి సంవత్సరము లోగ వధూనియమము :** వివాహమునుండి మొదటి ఆషాఢమాసము అత్తవారి ఇంటిలో కన్య యుండిన అత్తకు అరిష్టము, క్షయమాసమందుండిన కన్యకకు అరిష్టము, జ్యేష్టమాసమందుండిన బావకరిష్టము, పౌష్యమాసమందుండిన మామకరిష్టము, అధిక మాసమందుండిన భర్తకరిష్టము, చైత్రమాసమందు తండ్రి యింటిలో యుండిన తండ్రి కరిష్టము గనుక వివాహమైన సంవత్సరములో ఈ నియమములు పాటించవలయును.

**సపిండ శ్రాద్ధ విషయము :** వివాహమైన తదుపరి 1 సంవత్సరమువరకు, ఉపనయనమైన తదుపరి 6 మాసముల వరకు, పుట్టువెంట్రకలు తీసిన తదుపరి 3 మాసముల వరకు, తల్లిదండ్రులు శ్రాద్ధములు తప్ప ఇతర సపిండుల శ్రాద్ధములను చేయగూడదు.

**గురుశుక్ర మౌఢ్యములయందు వర్జకర్మలు :** బావి, చెరువు త్రవ్వుట, యజ్ఞ, యాత్ర, వివాహ, ఉపనయన, చౌల, దేవప్రతిష్ఠ, విద్యారంభ, నూతన గృహప్రవేశము, కర్ణవేదన గురూపదేశము, తీర్థస్నానము, సకామనా హోమము, ఇత్యాది శుభకార్యములను చేయగూడదు. గ్రహశాంతులు, జన్మనక్షత్ర దోషశాంతులు పనికి వచ్చును.

**హవిష్య పదార్థములు :** వడ్లు, గోధుమలు, పెసలు, నువ్వులు, ఆవాలు, బటానీలు, తెల్లరత్న పురిగడ్డలు, సైంధ లవణము, సముద్ర లవణము, ఆవుపాలు, పెరుగు, నెయ్యి, పనసపండ్లు, మామిడిపండ్లు, కొబ్బరికాయలు, కరక్కాయలు, పిప్పళ్ళు జీలకర్ర, శొంఠి, చింతపండు అరటిపండ్లు, రాచ ఉసిరికాయలు, ఉసిరి కాయలు, చక్కెర, చెరుకు, నేతిలో వేయించిన పదార్థములు, బర్రెనెయ్యి మాత్రం తీసుకొనవచ్చును, లవంగములు, ఇలాయిచీలు, దానిమ్మపండ్లు, నారింజ, దూస వరిబియ్యం, పాలకూర, వీటిని ఫలహారముగా ఉపయోగించవచ్చును.

**పశువులనమ్ముటకు కొనుటకు :** అశ్విని, హస్త, పుష్య, రేవతి, జ్యేష్ఠ, పునర్వసు, శతతారకా, ధనిష్ఠ, యీ 8 నక్షత్రములయందు పశువులనమ్ముటకు కొనుటకు శుభము.

**చేనులో నాగలి కట్టుటకు ముహూర్తము :** అనూరాధ, రేవతి, మృగశిరా, చిత్త, రోహిణి, ఉత్తరా, ఉ.షా. ఉ.భా., అశ్విని, హస్త, పుష్యమి, శ్రవణం, ధనిష్ఠ, శతతారకా, పునర్వసు, స్వాతి, మూల, మఘ, విశాఖ, కొత్తగా నాగలికట్టుటకు శుభము.

**బీజవాపమునకు (విత్తనముల వేయుటకు) :** హస్త, అశ్విని, పుష్యమి, ఉత్తరాత్రయము, రోహిణి, చిత్త, అనూరాధా, మృగశిరా, రేవతి, స్వాతి, ధనిష్ఠ, మఘ, మూల, ఈ నక్షత్రములయందు అలికిన మంచిగా ఫలించును. బీజఫణి చక్రమందు దుష్టఫలనక్షత్రముల నొదలి బీజారోపణ చేయవలయును.

**వరికోతకు ముహూర్తము :** అశ్విని, రోహిణి, పుబ్బ, విశాఖ, అనూరాధా, శతతారా, రేవతి, యీ యేడు నక్షత్రములయందు 4-9-14, యీ తిథుల నొదలి శని, మంగళవారముల నొదలి, జేయవలయును.

**చెరుకు పెట్టుటకు ముహూర్తము :** ఆర్ద్ర, పుష్య, ధనిష్ఠ, అనూరాధా, మూల, రేవతి, శతతారకా, ఉత్తరా, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, ఆది, మంగళవారము అందు చెరకు పెట్టిన విశేషముగ ఫలించును.

**అరటి తోట వేయుటకు :** హస్త, చిత్త, ఉత్తరా, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మూల, అనూరాధా, రేవతి, అశ్విని, రోహిణి, పుష్యమి, యీ నక్షత్రములయందు ఉత్తరాయణమందు, బుధ, గురు, శుక్ర, సోమవారములందు, శుభతిథులయందు, వృక్షారోపణ చేయవలయును.

**కార్య పరత్వముగా గ్రహ బలములు :** రాజకార్యములకు రవి బలము, వివాహమునకు గురుబలము, యుద్ధమునకు అంగారకబలము, విద్యాభ్యాసనమునకు బుధబలము ప్రయాణమునకు శుక్రబలము, మంత్రదీక్షకు శనిబలము, సర్వకార్యములకు చంద్రబలముండవలయును.

**యంత్రకృత్యం :** నూనె గానుగ, చెరకుగానుగ ప్రారంభించుటకు ధనిష్ఠ, అశ్విని, హస్త, చిత్త, అనూరాధా, పుష్యమి, జ్యేష్ఠ, పునర్వసు, రేవతి, యీ నక్షత్రములయందు, బుధ, గురు, శుక్రవారములందు పూర్ణ తిథులందు ప్రారంభించవలయును.

**ప్రస్థానముంచు విధానము :** మంచి ముహూర్తమున ప్రయాణము చేయుట కుదరని యెడల ఆ ముహూర్తమున ప్రస్థానము మనమే దిశకు వెళ్లవలసియుంటే ఆ దిశకే రెండవవారి యింటిలో, బ్రాహ్మణులు, యజ్ఞోపవీతమైన లేక పుస్తకమునైన, నుంచవలయును, క్షత్రియులు శస్త్రము, వైశ్యులు తేనె, శూద్రులు ఫలములను వుంచవలయును. చాతర్వర్ణస్థులు, సువర్ణము, ధాన్యము, వస్త్రములు వుంచవచ్చును. ప్రస్థానము రాజులకు 10 రోజుల వరకు ఇతరులకు 5 దినముల వరకు ఉపయోగించును, ప్రయాణమయ్యే రోజున ప్రస్థానముంచిన వస్తువును తీసుకొని వెంటనుంచుకొని ప్రయాణము గావలయును.

**- తిథుల సంజ్ఞలు -**

| నంద | భద్ర | జయా | రిక్తా | పూర్ణా |
|---|---|---|---|---|
| ప్రతిపద<br>షష్ఠి<br>ఏకాదశి | ద్వితీయా<br>సప్తమీ<br>ద్వాదశి | తృతీయా<br>అష్టమి<br>త్రయోదశి | చతుర్థి<br>నవమి<br>చతుర్దశి | పంచమి<br>దశమి<br>పూర్ణిమ |

**నంద తిథులయందు చేయదగిన కార్యములు :** అనందాది కర్మలు, వాస్తుకర్మ, క్షేత్రర్పణము, నృత్యారంభము జేయవచ్చును.

**భద్ర తిథులయందు :** వివాహము, నూతనాంబర భూషణధారణము, నూతన శకటాది వాహనారోహణము, పౌష్టిక కర్మలు చేయవచ్చును.

**జయ తిథులయందు :** యుద్ధసంబంధమైన పనులు, శుభకర్మలు చేయవచ్చును.

**రిక్త తిథులయందు :** వధ, ఘాతి, విష, అగ్ని, శస్త్రం మొదలగు కర్మలు చేయవచ్చును.

**పూర్ణ తిథులయందు :** మంగళకార్యములన్నియు, వివాహము,యాత్రాది సర్వకార్యములును చేయవచ్చును.

**వార నిర్ణయము :** రాత్రిని 3 భాగములు చేసి రెండు భాగముల వరకు పూర్వదినమనియు 3వ, భాగమునుండి పరదినము స్థాలికపాక రజస్వల జనన జనన మరణాదులకు ఇవిగాక యితర కార్యములకు, సూర్యోదయం నుండి సూర్యోదయం వరకు వారప్రవృత్తియని గ్రహించగలరు. ఉదయాదుదయం వారం.

**గ్రహదృష్టులు :** రవి బుధ శుక్ర చంద్రులు తామున్న చోటునుండి ఏడవ స్థానమును జూచుదురు, శని 3-10 స్థానములు జూచును, గురుడు తానున్న చోటు నుండి 5-9 స్థానముల జూచును, అంగారకుడు 4-8 స్థానముల జూచును, రాహుకేతువులు తామున్న చోటు నుండి ఏడవ ఇల్లు జూచెదరు.

**అతిమిత్ర అతిశత్రుజ్ఞానము :** నైసర్గిక మిత్రుడు తాత్కాలిక మిత్రుడాయనేని అతిమిత్రుడగును నైసర్గిక శత్రువు తాత్కాలిక శత్రువాయనేని అతి శత్రువగును, శత్రుమిత్రత్వము గలిగిన సమడగును సమశత్రుత్వము గలిగిన శత్రువగును.

## త్రికోణ కేంద్రస్థానములు

లగ్నకుండలియందు 1-5-9 యీ స్థానములకు త్రికోణ స్థానములని పేరు. 1-4-7-10 యీ స్థానములకు కేంద్రస్థానములని పేరు. కేంద్రమందుండు గ్రహము బలవంతమైనదనియు, కోణమందుండు గ్రహము శుభఫలమిచ్చునని గ్రహించవలయును.

## గ్రహస్థానబలము

స్వోచ్ఛస్థానమందుండు గ్రహము, సంపూర్ణ బలముగా నుండును. స్వక్షేత్రమందు త్రిపాదబలము, మిత్రగృహమందు అర్థబలము సమ క్షేత్రమందు పాదబలము, శత్రుక్షేత్రమందు అష్టమాంగబలము, నీచయందు బలహీనతయని గ్రహించవలయును.

## ఉచ్చనీచరాశులు

| గ్రహములు | ఉచ్చరాసులు | నీచరాసులు |
|---|---|---|
| సూర్యుడు | మేషం | తులా |
| చంద్రుడు | వృషభం | వృశ్చికం |
| అంగారకుడు | మకరము | కర్కాటకము |
| బుధుడు | కన్యా | మీనము |
| గురుడు | కర్కాటకము | మకరము |
| శుక్రుడు | మీనము | కన్యా |
| శని | తులా | మేషము |

## పంచకరహితము

అశ్విన్యాది నక్షత్రసంఖ్యను శుక్ల ప్రతిపదాది తిథి సంఖ్యను, రవి వారాదివార సంఖ్యను మేషాదిలగ్న సంఖ్యను యీ సంఖ్యలనన్నిటిని ఒక చోటగూడి, తొమ్మిదిచే భాగించగా, 1 మిగిలిన మృత్యు పంచకమగును, 2 మిగిలిన అగ్ని పంచకము, 4 మిగిలిన రాజ పంచకము 6 మిగిలిన చోర పంచకము, 8 మిగిలిన రోగ పంచకము, సకల శుభ కార్యములకు, 3-5-7-9, యీ సంఖ్యలు మిగిలిన పంచక రహితమగును, రహితమే శుభము.

## మార్తాండరీత్యా పంచకరహితము

శుక్ల ప్రతిపదాదిగత తిథి సంఖ్యలో మేషాదిలగ్న సంఖ్యను గూడి, తొమ్మిదిచే భాగించగా 3-5-7-9 మిగిలిన పంచకరహితమగును.

## అంశచక్రమ్

శ్లో॥ చోరస్తుభోక్తామతిమాన్ ధనాడ్యో । రాజానపుంసీ విజయీదరిద్రః
కార్యేషుదక్షః ఖలకర్మకర్తా । క్షుద్రస్యవిద్వాన్ ఇతిద్వాదశాంశాః ॥

తా॥ యేనక్షత్రమందు యేపాదమందు జన్మించితే ఆ నక్షత్రపాదము మీదుగా అంశచక్రమందు చూడగా అంశలేర్పడును

| నక్షత్రములు | అశ్వి | రోహి | పున | మఘ | హస్త | విశా | మూల | శ్రవ | పూభా | అంశలు ఫలం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మొదటి పాదం | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | ప్రథమాంశ చోరః |
| రెండవ పాదం | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | ద్వితీయాంశ భోక్తా |
| మూడవ పాదం | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | తృతీయాంశ మతిమాన్ |
| నాల్గువ పాదం | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | చతుర్థాంశ ధనాఢ్యః |

| నక్షత్రములు | భర | మృగ | పుష్య | పూఫ | చిత్త | అనూ | పూషా | ధని | ఉభా | అంశలు ఫలం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మొదటి పాదం | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | పంచమాంశ రాజా |
| రెండవ పాదం | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | షష్ఠమాంశ నపుంసకః |
| మూడవ పాదం | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | సప్తమాంశ విజయీః |
| నాల్గువ పాదం | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | అష్టమాంశ దరిద్రః |

| నక్షత్రములు | కృ | ఆర్ద్ర | ఆశ్లే | ఉత్త | స్వా | జ్యే | ఉ.షా. | శ్ర | రేవ | అంశలు ఫలం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మొదటి పాదం | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | నవమాంశ కార్యదక్షః |
| రెండవ పాదం | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | 2 | దశమాంశ దుష్టకర్మా |
| మూడవ పాదం | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | ఏకదశాంశ క్షుద్రః (క్రోధి) |
| నాల్గువ పాదం | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | 4 | ద్వాదంశ విద్వాన్ |

## అంశాధిపతి చక్రమ్

| నక్షత్రములు | నక్షత్రములు | నక్షత్రములు |
|---|---|---|
| అశ్వి, రో, పున, మఘ, హ విశా, మూ, శ్ర, పూభా | భర, మృ, పుష్య, పూష, చి అనూ, పూషా, ధని, ఉభా | కృ, ఆర్ద్రా, ఆశ్రే, ఉఫ, స్వా, జ్యే, ఉషా, శత, రే |
| పాదములు-అంశ-అధిపతులు | పాదములు-అంశ-అధిపతులు | పాదములు-అంశ-అధిపతులు |
| 1. ప్రథమాంశ కుజ<br>2. ద్వితీయాంశ శుక్ర<br>3. తృతీయాంశ బుధ<br>4. చతుర్థాంశ చంద్ర | 1. పంచమాంశ రవి<br>2. షష్ఠమాంశ బుధ<br>3. సప్తమాంశ శుక్ర<br>4. అష్టమాంశ కుజ | 1. నవమాంశ గురు<br>2. దశమాంశ శని<br>3. ఏకాదశాంశ శని<br>4. ద్వాదంశ గురు |

శ్లో॥ రాశినాథే, విరుద్దేపి మిత్రే చాంశాధిసేసతి । అంశనాయక మిత్రత్వం వివాహంపుత్ర పౌత్రదా ॥

శ్లో॥ అంశమిత్రేణ కర్తవ్యం విసృజ్యద్రాశిమైత్రదా । ఆహుస్తత్కాలమిత్రత్వం గర్గ్యాది ముని సమ్మతం ॥

వధూవరుల గ్రహ రాశ్యాధిపతులు (గ్రహమైత్రి) విరోధమైనపుడు వారి అంశనాథుల గ్రహమిత్రత్వము ఉన్న యెడల వివాహము శుభప్రదమని గర్గ్య, కాశ్యపాది ఋషులమతము (కాలమాధవీయే)

## గ్రహముల మీదుగా స్వర్ణాది పాద ఫలము

శనికి లోహపాదము విచ్చనట్లు అయితే శుభము. గురు శుక్రులకు స్వర్ణపాదము శుభము. బుధ చంద్రులకు రజితపాదము శుభము. రవి కుజ రాహు కేతువులకు తామ్రపాదము శుభము.

## సాడేసాత్ శని పరిజ్ఞానము

జన్మరాశి లేక నామరాశి నుండి 12వ స్థానమందు శనియుండిన ముఖమునకు శని వచ్చినదనిర్థ, రెండు సం॥ల ఆరు మాసములుండను. వారి వారి జన్మరాసులయందే శని యుండిన హృదయమందు 2 సం॥ 6 మాసములుండును. జన్మ లేక నామరాసులకు రెండవ స్థానమందు శని యుండిన పాదములయందు 2 సం॥ 6 మాసములుండును. మొత్తం 7 సం॥ల 6 మాసములగును. దీనినే ఏడేళ్ళ నర్థం శని యందురు. నాలుగవ స్థానమందు శని వచ్చిన అర్థాష్టక మనియు, 8 స్థానమందు అష్టమ శనియనియు 2 సం॥ 6 మాసములుండును. ఫలము-బంధు విరోధము, ధన నష్టము, విదేశగమనము, చోరాగ్ని భయము, శతృపీడ, గృహకల్లోలము, భార్యా పుత్రాదులకు అనారోగ్యము, రోగభయము, బుద్ధి భ్రష్టత్వము, స్థానాశనము ఇత్యాది ఫలములు గలుగుచుండును.

(సాడేసాత్ శని వచ్చినప్పుడు పఠించదగిన శనిస్తోత్రము)

శ్లో॥ కోణస్థో పింగలో బభ్రుః కృష్ణో రౌద్రాంతకో యమః ।
సౌరి శ్శనైశ్చరో మందః పిప్పిలా దేన సంస్తుతః ।
ఏతాని దశనామాని ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
శ్శనైశ్చర కృతాపీడా న కదాచి ద్భవిష్యతి ॥

యీ స్తోత్రము ప్రతిరోజు పఠించి శనికి ఒక నమస్కారము చేసిన యెడల శని పీడా పరిహారమగును. సుఖ, శాంతుల కలుగును.

## జన్మనక్షత్ర జన్మరాసులయందు గ్రహణాదులు సంభవించిన ఫలము.

జన్మనక్షత్ర జన్మరాసులయందు గ్రహణము గలిగి నపుడు గ్రహణమును జూడక గ్రహణము విడిచిన తార్వత స్నానముజేసి సువర్ణముచే చేయించిన నాగము, రజితబింబము, తిలలు, ఒక కాంస్యపాత్ర యందుంచి పూజించి వస్త్రయుగ్మ సహితముగా మమ జన్మరాశి గ్రహణపీడా పరిహార్థాం బింబదానం కరిష్యే అని దానమియ్యవలయును.

## పుట్టు మచ్చల ఫలములు

| స్థానములు | ఫలములు | స్థానములు | ఫలములు |
|---|---|---|---|
| కుడి కనుబొమ్మ | భార్యగుణవతి | ఎడమ కనుబొమ్మ | కార్యభంగము |
| కంటికొనయందు | శాంతస్వభావము | చక్కిళ్లయందు | స్వల్పధనము |
| ముక్కుపైన | కార్యసిద్దిగలవాడు | మీది పెదవియందు | కాముకుడగును |
| గడ్డమునందు | గౌరవము | కంఠమునందు | ద్రవ్యప్రాప్తి |
| దక్షిణకుచమందు | స్త్రీ సంతానము | యెడమ కుచమందు | కార్యజయము |
| వక్షస్థలమందు | ధనవంతుడగును | ఉదరమందుండిన | తిండిపోతగును |
| కుడితొడయందు | సంపద | యెడమ తొడ | దరిద్ర్యము |
| కుడిమోకాలు | స్త్రీసౌఖ్యము | యెడమమోకాలు | అల్పబుద్ది |
| పిక్కలయందు | ఆలస్యము | చీలమండలు | స్త్రీస్వభావం |
| పాదములందు | వ్యాధిగ్రస్తుడగును | పొత్తికడుపున | దుర్బలత్వము |
| కుడిభుజము | నేర్పుగలవాడు | యెడమభుజము | మూర్ఖబుద్ధి |
| కుడిచెయ్యి | ధైర్యము | యెడమచెయ్యి | యుద్ధవిజయము |
| మణికట్టు | ధనప్రాప్తి | ముక్కునందు | దేశసంచారము |
| భుజము | సౌఖ్యహాని | క్రిందిదవుడ | దుఃఖము |
| ముఖము | క్రూరత్వము | స్త్రీలకు ముఖమునందు | దుర్బుద్ధి |
| యెడమభాగం | దురాచారం | | |

## తేనెతెట్ట, పుట్టలు, మొండి చేతులు ఇంటియందు గలిగిన ఫలములు

– గృహమధ్యమందును దక్షిణభాగమందును ఈశాన్యమందును నైఋతి యందును తేనెతెట్ట, పుట్టలుగాని, మొండిచేతులు గాని గలుగ గూడదు. అట్లు గలిగిన యెడల ఆ గృహము (6) నెలల పర్యంతము విడిచిపెట్టి అనంతరము శాస్త్రోక్తవిధిగా శాంతి చేసి ఆ గృహమందు ప్రవేశింపవలయును. అట్లు శాంతిచేయక ఆ గృహమందు ప్రవేశించిన యెడల ఆ యింటివారకి అపమృత్యుదోషము సంభవించును. జీవహింసలు గూడా కలుగుచుండును.

## నష్టవస్తు నక్షత్ర ప్రశ్న

రోహి, పుష్య, ఉ.ఫ., విశా, పూషా, ధని, రేవతి ఈ (7) నక్షత్రముల యందు పోయిన వస్తువు పూర్వ దిశకు తొందరగా దొరుకును. మృ, ఆశ్రే, హస్త, అనూ, ఉషా, శత, అశ్వి ఈ (7) నక్షత్రముల మందు పోయిన వస్తువు (3) రోజులలో దక్షిణ దిశకు దొరుకును. ఆర్ద్ర, మఖ, జ్యే, అభిజిత్, పూభా, భరణి ఈ (7) నక్షత్రములలో పోయిన వస్తువు ప్రభుత్వము వారి వలన విశేష ప్రయత్నముచే పశ్చిమ దిశకు లభించును, పున, పూఫ, స్వా, మూల, శ్ర, ఉభా, కృ ఈ (7) నక్షత్రములందు పోయిన వస్తువు విశేష ప్రయత్నము చేతనైనా లభించనేరదు.

## మార్గ ప్రశ్న

ప్రశ్న కాల సమయమందలి తిథి నక్షత్ర ప్రహర సంఖ్యనొకచే గూర్చి (8) చే గుణించి (7)చే భాగించగా (1) మిగిలిన పృథివి యందును, (2) మిగిలిన భాండమందును, (3) మిగిలిన జలమందును, (4) మిగిలిన అంతరాళమందును, (5-6-0) మిగిలిన సర్కారివారి వలన ఆ నష్ట వస్తువు లభించునని చెప్పవలయును.

## గంధర్వ వివాహమునకు

మూ, అనూ, హస్త, స్వా, రే, మఘ, ఉ.ఫ., ఉ.షా., ఉ.భా., రోహి, మృగ ఈ నక్షత్రములలో కృష్ణపక్షమందు 2-3-5-7-10-13 ఈ తిథులందును సూర్యనక్షత్రము మొదలుకొని చంద్ర నక్షత్ర పర్యంతం లెక్కింపగా (1) మొదలు (3) నక్షత్రముల వరకు మరణము, (3) ధనప్రాప్తి, (3) హాని (3) అశుభమ్, (3) పుత్రలాభము, (3) అనారోగ్యము, (3) దౌర్భాగ్యము, (3) లక్ష్మిప్రాప్తియు, (3) అసౌఖ్యము ఈ క్రమముగా గంధర్వ వివాహమునకు చూడవలెను. వీటికి గురు శుక్ర మౌఢ్యదోషములు లేవు.

## సన్ముఖ చంద్ర లక్షణము

మేష, సింహ, ధనురాసులయందుండిన చంద్రుడు పూర్వదిశకుండును. వృషభ, కాన్య, మకర రాసులలో చంద్రుడు దక్షిణ దిశకును, మిథున, తులా, కుంభ రాసులో చంద్రుడు పశ్చిమదిశకును, కర్క, వృశ్చి, మీనరాసులలో చంద్రుడుత్తరదిశకుండును. సన్ముఖముగా లేక కుడివైపున నుండగా ప్రయాణం చేసిన యెడల సకల కార్యములు సిద్ధియగును.

## దత్త విధానమునకు

హస్త, స్వా, విశా, అనూ, అశ్వి, ధని, పుష్య ఈ (8) నక్షత్రముల యందు భాను, గు, శుక్రవారములలో (2-3-5-7-10-11) ఈ తిథులయందును వృశ్చిక కుంభ లగ్నముల యందును ఉత్తరాయణమున దత్త స్వీకారము చేయవలెను.

## జననముకు గండ నక్షత్రములు

అశ్విని మొదటి పాదము తండ్రి గండము (3) నెలలు త్యాజ్యము సువర్ణ దానము. భరణి (3) పాదమందు శిశుగండము 1 నెల త్యాజ్యము రజిత దానము. రోహిణీ (1-2) పాదములు మేనమామ గండములు బ్రాహ్మణ భోజనము. పుష్య (1-2) పాదములు తల్లిగండము (3) నెలు త్యాజ్యము చందన దానము, ఆశ్రే, మఖ ప్రథమ చరణములు పితృగండము (2) మాసములు త్యాజ్యము అశ్వదానము. ఉఫ 1-2 పాదములందు పెద్ద తండ్రి గండము, (2) మాసములు త్యాజ్యము తిలపాత్రదానం, చిత్ర 1-2-3 చరణములందు మేనత్త గండము (6) మాసములు త్యాజ్యము వస్త్రదానము జ్యేష్ఠ (2-3-4) పాదములు తల్లి గండము (8) మాసములు త్యాజ్యము గోదానం, మూల (1-2-3) పాదములు తల్లిదండ్రులకు గండము మహిష దానము. దాన శాంతి త్యాజ్యములు చేసినవారికి గండములు తొలుగును.

## గ్రహములు స్వర్ణాది పాదస్థితి

స్వజన్మరాశి నుండి గ్రహప్రవేశ రాశివరకు ద్వాదశ సంఖ్యచే నెంచగా (1-6-11) వచ్చిన సువర్ణపాదమనియు (2-5-9) వచ్చిన రజితపాదమనియు, (3-7-10) తామ్రపాదమనియు, (4-8-12) లోహపాదమనియు, గురు-శుక్రులకు సువర్ణపాదము, బుధ-చంద్రులకు రజిత పాదము, రవి-కుజులకు తామ్రపాదము, శని-రాహు-కేతువుకు లోహపాదము శుభప్రదమని తెల్పవలెను.

## యజ్ఞ యాగోద్యాపనాదులకు అగ్నిజూచుట

శుక్ల ప్రతిపదనుండి వర్తమాన తిథి వరకు వారాది కార్యారంభ వారము వరకు నొకటితో గలిపి (4) చే భాగించగా (0-3) మిగిలిన ఆకాశమందగ్ని యుండును. ప్రాణహానికరమనియు (2) మిగిలిన పాతాళమందగ్ని యుండును. అర్థనాశమని గుర్తెరుంగ వలయును.

## క్రొత్త దుకాణము, నూతన ఖాతా పుస్తకాలు పెట్టుటకు ముహూర్తం

శుద్ధ (2-3-5-10) బహుళ (2-3-5) ఈ తిథులయందును (ధని, శత, మూల, అనూ, ఉఫ, పుష్య, రేవ, రో, మృ, హస్త, చిత్ర, అశ్వని) యను నక్షత్రముల యందును, బు - శుక్ర వారములలో వ్యయశుద్ధిగల లగ్నమందు శుభహోరలయందును, పూర్వాహ్నాయందు చేయవలయును.

## గండ పురుష వాసము

మాఘ-ఫాల్గుణ-వైశాఖ-శ్రావణ మాసములందు ఆకాశమందుండును. ఆశ్వీజ, కార్తీక, చైత్ర, భాద్రపద మాసములయందు పాతాళమందుండును. జ్యేష్ఠ, ఆషాఢ, మార్గశిర్ష, పౌష్య మాసములందు భూలోకమందుండును. ఈ గండపురుషుడు ఆకాశ పాతాళముల యందుండగా దుష్టనక్షత్రమున జన్మించిన ఏమి దోషములు ఉండవు.

## రవ్యాది గ్రహరాశిస్థిత ఫలములు

సూర్యుడు (1) నెల ఒక రాశియందుండును. అందు మొదటి (5) దినములు ఫలమిచ్చును. చంద్రుడు (2) దినములు (15) ఘడియలుండును. (3) ఘడియలు ఫలమిచ్చును. కుజుడు (1) నెల (15) రోజులుండును. (8) రోజులు ఫలమిచ్చును. బుధుడు (1) నెల యుండును. (3) రోజులు ముందు ఫలమిచ్చును. బృహస్పతి (12) మాసములుండును. (2) నెలలముందు ఫలమిచ్చును. శుక్రుడు (1) నెల యుండును. (7) దినములు ఫలమిచ్చును. శని (30) మాసములుండును. అంతమందు (6) నెలలు ఫలగతుండగును. రాహు, కేతువులు (18) మాసములుందురు. అంతమున (2) నెలలు శుభము నిచ్చెదరు.

## రోగనక్షత్రము దినసంఖ్య

అశ్వి, కృ, మూ ఈ నక్షత్రములందు జ్వరము వచ్చిన (9) దినములకు తగ్గును. రో, పూభా, పున, పుష్య, ఉఫ ఈ నక్షత్రములలో (7) దినములకు మఘ (20) దినములకు, శత, భర, చిత్త, శ్రవ ఈ నక్షత్రములయందు (11) దినములకు, ధని, విశా, హస్త (15) దినములు, మృగ, ఉషా, 1 మాసమునకు, రేవ, అనూ, ఔషధముచే నివర్తించును. పూఫ, పూషా, పూభా, ఆశ్రే, జ్యే, ఆర్ద్ర, స్వా ఈ నక్షత్రములందు జ్వరము వచ్చిన చాలా కష్టతరముగా తగ్గును.

## బల్లిపాటు ఫలములు

శిరస్సుపైన పడిన - కలహం, ముఖం - బంధుదర్శనం, కనుబొమ్మల నడుమ, కీర్తి, అధరోష్టము - హానియు, నాసికమందు - వ్యాధియు, దక్షిణ కర్ణమందు - దీర్ఘాయువు, వామకర్ణమందు - వ్యవహారలాభము, నేత్రములందు - ధనలాభము, ముఖమందు - భయము, కంఠమందు - శత్రుపీడ, దక్షిణభుజమందు - ఆరోగ్యము, వామభుజమందు - స్త్రీ సౌఖ్యము, కుడిచేతయందు - జ్ఞానవృద్ధి, ఎడమ చేతి యందు - రోగప్రదము, వక్షస్థలమందు - దోషము, ఉదరమందు - ధనలభ్యం, పాదములందు - ప్రయాణం, వీపునందు - మంగళప్రదము, మానస్థలమున - ధననష్టము, కేశాంతములందు - మరణము ఇవి గల్గును. బల్లి స్పృశించిన వెంటనే శిరస్నానము జేసి ఇష్టదేవతారాధన జేసి విష్ణుకంచియాత్ర వెళ్ళివచ్చినవారికి సాష్టాంగ నమస్కారము జేసిన ఆదోషము నివారణమగును.

## తారాబలాది ఫలము జూచుట

జన్మనక్షత్రము మొదలుకొని నిత్య నక్షత్రము వరకు లెక్కించి (9)చే భాగించగా శేషము (1) మిగిలన జన్మతార - దేహపీడ, (2) మిగిలిన సంపత్తార - సంపదయు, (3) మిగిలిన విపత్తార - కార్యభంగము, (4) మిగిలిన క్షేమతార - సౌఖ్యము, (5) మిగిలిన ప్రత్యక్తార - కార్యభంగము, (6) మిగిలిన సాధనతార - కార్యసాఫల్యం, (7) మిగిలిన నైధనతార - హానిప్రదము, (8) మిగిలిన మిత్రతార - సౌఖ్యానుబంధం, (9) మిగిలిన పరమ మైత్రతార - అర్థలాభమని శుభాశుభఫలములు జూచుకొనవలెను.

## గృహప్రవేశమునకు కలశ వస్తువు

సూర్య నక్షత్రము మొదలు దిన నక్షత్రము వరకు లెక్కించగా

| | |
|---|---|
| 1 | శిరస్సు .............................. శిరచ్ఛేదనము |
| 4 | ప్రాక్‌భాగము .............................. పరదేశగమనము |
| 4 | దక్షిణభాగము .............................. నిర్భయము |
| 4 | పశ్చిమభాగము .............................. ధాన్యము |
| 4 | ఉత్తరభాగము .............................. దారిద్ర్యము |
| 4 | మధ్యభాగము .............................. గర్భస్రావము |
| 4 | కంఠస్థానము .............................. సంపత్తు |
| 3 | అధఃప్రదేశము .............................. పూర్ణాయువు |

## సాడేతీన్ ముహూర్తములు

సంవత్సరాది, అక్షయతృతీయ, విజయదశమి, కార్తీక శు॥ 1 రోజున సాయంత్రం వరకు వీనికి సాడేతన్ ముహూర్తములని వాడుక గలదు. ఈ దినములలో పంచాంగశుద్ధి చూడకయే ప్రతికార్యమును ప్రారంభింపవచ్చును.

## డోలాచక్రము

సూర్య నక్షత్రము మొదలుకొని నిత్య నక్షత్రము వరకు లెక్కించగా

| | |
|---|---|
| 5 | పూర్వభాగమందు .............................. ఆరోగ్యము |
| 5 | దక్షిణభాగమందు .............................. మరణము |
| 5 | పశ్చిమ భాగమందు .............................. అర్థలాభము |
| 5 | ఉత్తరభాగమందు .............................. వ్యాధియును |
| 7 | మధ్య భాగమందు .............................. సుఖప్రదము |

## గృహారంభమునకు వృషభ వాస్తువు

సూర్య నక్షత్రము మొదలుకొని నిత్య నక్షత్రము వరకు లెక్కించగా

| | |
|---|---|
| 3 | శిరస్సు .............................. మృత్యువు |
| 4 | ముందరి కాళ్ళు .............................. దురవస్థ |
| 4 | వెనుకటి కాళ్లు .............................. చిరకాలము |
| 3 | తోక .............................. దేశభ్రమణము |
| 4 | ఎడమ పార్శ్వము .............................. ధనప్రధానము |
| 4 | కుడి పార్శ్వము .............................. ధాన్యము |
| 3 | పృష్ఠభాగము .............................. సంపద |
| 3 | ముఖము .............................. పశులాభము |

## పశుచక్రం

| స్థానములు | నక్షత్రం | ఫలములు |
|---|---|---|
| లలాట | 1 | లాభము |
| నేత్రము | 2 | పశువృద్ధి |
| దంతము | 3 | నిష్ఫలము |
| పాదము | 4 | పశుక్షయము |

| స్థానములు | నక్షత్రం | ఫలములు |
|---|---|---|
| గర్భము | 5 | లాభము |
| శృంగము | 6 | రోగము |
| హృదయము | 6 | లాభము |

## స్తంభచక్రము

| | |
|---|---|
| 2 | స్తంభమూలయందు .............................. ధనక్షయము |
| 20 | స్తంభమధ్యభాగమున .............................. లక్ష్మీకరము |
| 6 | స్తంభాగ్రమందు .............................. మరణము |

## గ్రామ చక్రం

సూర్య నక్షత్రము మొదలుకొని నిత్య నక్షత్రము వరకు లెక్కించగా

| స్థానములు | నక్షత్రం | ఫలములు | స్థానములు | నక్షత్రం | ఫలములు |
|---|---|---|---|---|---|
| శిరస్సు | 5 | ధనలాభము | నాభి | 4 | సంపత్ |
| ముఖము | 3 | ధననాశనము | గుహ్యాము | 2 | భయము |
| హృదయం | 5 | ధాన్యలాభము | దక్షిణ హస్తం | 1 | లాభము |
| పాదములు | 6 | దరిద్రత | వామహస్తం | 1 | వియోగము |
| పృష్టం | 1 | ప్రాణభీతి | | | |

## ద్వార చక్రము

సూర్య నక్షత్రము మొదలుకొని నిత్య నక్షత్రము వరకు లెక్కించగా

| | |
|---|---|
| 4 | ద్వార ఊర్ధ్వభాగము ..................... రాజ్యప్రాప్తియును |
| 8 | ద్వారకోణములు ......................... ఉద్వాసనము |
| 4 | ద్వార దక్షిణ భాగము .................... లక్ష్మిప్రాప్తియు |
| 4 | ద్వార ఉత్తర భాగము ..................... సౌఖ్యము |
| 4 | ద్వార అధో భాగము ...................... మరణము |
| 3 | ద్వార మధ్యభాగము ...................... ధనప్రాప్తియు |

## త్యాజ్య యోగములు

వ్యతీపాత్, వైధృతులు, సంపూర్ణముగా త్యజించదగినవి. పరిఘనామయోగ పూర్వార్థము : విష్కంభమునకు 3 ఘడియలు, వజ్రవ్యాఘాతములకు 9 ఘడియలు, శూలకు 5 ఘడియలు, గండాతి గండములకు 6 ఘడియలు, శుభకర్మయందు విడువ వలయును.

## రజస్వలకు దుష్టనక్షత్రములు

పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, ఆర్ద్ర, కృత్తిక, పునర్వసు, జ్యేష్ఠ ఈ నక్షత్రములయందు రజస్వలయైన యథావిధిశాంతి చేయవలయును.

## ఉపనయన కాలము

వటువు యొక్క జన్మరాశికి బృహస్పతి శుభస్థానములయందున్న సమయమున అనగా 1-5-7-9-11 యీ స్థానముల యందుండగా కర్కాటధనుర్మీన రాసులయందున్న సమయమున గర్భాష్టమ సంవత్సరమునందు ఉపనయనము జేయుట ఉత్తమ ఫలమనియు, 9-10-11-12 సం॥ యందు జేయుట మధ్యమఫలమనియు, 16 సంవత్సరములకు పై ఉపనయనము చేయుట కధికారముండదు.

## జననకాల నక్షత్ర ఫలములు శాంతులు

అశ్విని నక్షత్ర జనన దోషములు : ప్రథమ పాదమందు జన్మించిన తండ్రికి శిశువునకు దోషము. ఈ దోషము 3 నెలల వరకు ఉండును. ఈ దోషశాంతికి నవగ్రహ జపము, నక్షత్ర జపము, సువర్ణ దానము చేయవలెను. శేషించిన 3 పాదములయందు జన్మించిన దోసము లేదు. నక్షత్ర దోసమునకు సామాన్య శాంతి 2-3-4 పాదముల యందు జన్మించిన వారి లక్షణములు ద్రవ్యవంతుడు, శౌర్యవంతుడు, సుందరుడు, సమర్థుడు, క్రౌర్యము గలవాడు, గొప్ప శరీరము గలవాడై యుండును.

భరణి నక్షత్ర జనన దోషములు : మూడవ పాదమందు జన్మించిన శిశవునకు దోషములు, నక్షత్రము దోసయుక్తమగుట వలన, నక్షత్ర నవగ్రహ, రుద్రాభిషేక పూర్వక శాంతి జరిపించుకొనుట ఉత్తమము. జన్మించిన వారి లక్షణములు. విద్యావంతుడు, ఆరోగ్యవంతును, మనస్థైర్యము గలవాడు విషయ గ్రహణగలవాడును, యదార్థముగా భాషించువాడును, ఖచ్చితమైన నిర్ణయము గైకొనువాడగును.

కృత్తిక నక్షత్ర దోషములు : మూడవ పాదమందు పురుష జననమైన తండ్రికిని స్త్రీ జననమైన తల్లికిని దోసములు. ఈ దోషశాంతికి నవగ్రహ నక్షత్రజపము, రుద్రాభిషేకము, తైలావేక్షణము జరిపించుకోవలెను. మిగతా పాదములలో జన్మించిన ఏ దోషము లేదు. లక్షణములు న్యాయశాస్త్ర మెరుగువాడును, భోజనప్రియుడు, అధికారము చలాయించువాడు ఆత్మాభిమానము గలవాడును.

రోహిణి నక్షత్ర దోషములు : ఈ నక్షత్ర ప్రథమ పాదమున జననమైన మేనమామకును, 2వపాదమున జన్మించిన తండ్రికి 3వ పాదమున తల్లికిని దోషము. 4వ పాదమున ఏ దోషము లేదు. అయినను నక్షత్రము కొన్ని మతములననుసరించి దూసితమగుట వలన రుద్రాభిషేకము. నక్షత్ర నవగ్రహజపములు సువర్ణదానము చేయవలెను. పురుషుడు జన్మించిన మంచి రూపము గలవాడు, స్థిర ఆలోచన గలవాడు, అభిమానవంతుడు, సుఖజీవనం గడుపువాడును, మంచి ప్రవర్తన గలవాడును, తేజోవంతుడును, సంభోగప్రియుడును స్త్రీ జన్మించిన సంతానం గలదియు సౌందర్యవంతురాలు కీర్తి, ప్రతిష్టలు గలది పూర్ణాయువులదై యుండును.

మృగశిరా నక్షత్ర దోసములు : ఏపాదములో జన్మించినను ఎట్టి దోషములేదు. పురుష జననం సంభవించిన ధనార్జనలో పైచేయి గలవాడు, శతృవులను జయించువాడును, చురుకైనా ప్రవర్తన గలవాడు మంచి కార్యములు చేయువాడు కోపాధిక్యము గలవాడును, స్త్రీ పుట్టిన రూపవతి సంతోసము గలదియు మంచిమర్యాదలు గలదియు, ధర్మపునడక గలదియు పుత్రసంతానము గలదియగును.

ఆర్ద్రా నక్షత్ర దోషములు : ఏ పాదములో పుట్టినను దోషము లేదు. శుభ ప్రదము, పురుషుడు జన్మించిన శూరవంతుడు సాహసిక కార్యములు చేయువాడు క్రయవిక్రయములలో ఆరితేరినవాడు కృతఘ్నుడు క్రౌర్యస్వభావం గలవాడు చీకూచింత లేనివాడగును. స్త్రీ జన్మించిన సతతం కలహించునది దుష్కార్యములు చేయునదగును.

పునర్వసూ నక్షత్ర జనన దోషములు : ఏ పాదమందైనను దోసము లేదు పురుషుడు పుట్టిన రూపలావణ్యయుక్తుడును పరస్త్రీ కార్యములు చేయువాడు పనులందునేర్పరి, ఆలోచించి కార్యముల సాధించువాడు, కొద్దితో తృప్తివడువాడు శీఘ్రగమనము గలవాడు. స్త్రీ పుట్టిన శాంత స్వభావము గలది తమవారితో ప్రేమాధికము గలది సహనము గలది ధార్మిక కార్యములు చేయునదియగును.

పుష్యమీ నక్షత్ర జనన దోషములు : ప్రథమ పాదమున పుట్టిన మేనమామకు 2,3 పాములలో పురుషుడు పుట్టిన తండ్రికిని స్త్రీ పుట్టిన తల్లికి 4వ పాదమున సామాన్యదోషం ఈ దోషం 3 నెలల వరకుండును. ఈ దోష శాంతికై తైలావేక్షణము జరిపించుకొనవలెను. గంధము చెక్కదానము చేసిన శమించును. పురుషుడు పుట్టిన కామోద్రేకములు గలవాడు స్థిర బుద్ధిగలవాడు శుభ్రముగా

ఉండువాడు, మంచిచదువు గలవాడగును. స్త్రీ పుట్టిన రూపవతియై ధార్మిక ప్రవర్తనలో దేవబ్రాహ్మణులను తృప్తిపరచునదియగును.

**ఆశ్లేషా నక్షత్ర జనన దోషములు :** మొదటి పాదములో ఏ శిశువు పుట్టినను దోషము లేదు. శుభప్రదము 2వ పాదమున పుత్రీపుత్రుల జననము ధన నష్టమును తృతీయ పాదమున తల్లికి, 4వ పాదములో తండ్రికి దోషము ఉంటుంది. స్త్రీ పుట్టిన యధాశాస్త్రముగా మహాన్యాసపూర్వక రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపము మరియు పురుషుడు జన్మించిన సామాన్యశాంతి జరిపించుకొనవెలను. సువర్ణ దానము చేయవలెను. పురుష జననమైన సుందరుడు సుఖ సౌభాగ్యములు అనుభవించువాడు. క్రూర స్వభావము గలవాడు వ్యసనములు గలవాడును స్త్రీ జన్మించిన అధికముగా మాట్లాడునదియు క్రూర స్వభావం గలది కలహమందాసక్తి గలదియగును.

**మఘా నక్షత్ర జనన దోషములు :** మొదటి పాదములో పుట్టిన శిశువునకు దోషము రెడవ పాదములో పుట్టిన తల్లికి, తండ్రికి దక్షసముంటుంది. 3,4 వ పాదములలో పుట్టిన దోషము లేదు. మొదటి పాదములో పుట్టిన వారికి మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహజపము జరిపించుకొనవలెను. అశ్వదానము చేయువలెను. పురుషుడు పుట్టిన నలుగురిలో క్రూరుడనిపించుకొనును. బలిసిన చెక్కిళ్ళు గలవాడు కోపాధికం గలవాడు ప్రకాశవంతుడును, వాదనలో దక్షుడు స్త్రీ పుట్టిన గౌరవ ప్రతిష్టలు గలదియు దేవతా గురుభక్తి గలదగును.

**పూర్వా ఫల్గుణి నక్షత్ర జనన దోషములు :** ఏ పాదమందు పుట్టినను సామాన్య దోషము దోషశాతికై తైలావేక్షణము జరిపించుకోవలెను. పురుషుడు పుట్టిన ధనికుడు ధార్మిక స్వభావి కార్యాకార్య విచారములు గలవాడు నృత్య శాస్త్రాభిమాని. స్త్రీ పుట్టిన నలుగురిలో పేరుగడించునది. సంతానం గలది ధనవంతురాలు శతృవులను జయించునది అగును.

**ఉత్తర ఫల్గుని నక్షత్ర జనన దోషములు :** 1-4 పాదములందు పురుషుడు పుట్టిన తండ్రికిని స్త్రీ పుట్టిన తల్లికిని దోషము. మిగతా రెండు పాదములందు పుత్రికా పుత్రులు పుట్టిన సోదరులకు సామాన్యదోషము. 1-4 పాదములందు పుట్టిన దోషశాంతికి రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహజపమ్ము జరిపించుకోవలెను. తిలపాత్ర దానమీయవలెను. పురుషుడు పుట్టిన శతృవులను జయించువాడునై సుఖ వ్యాదులననుభవించువాడును ధనవంతుడును, స్త్రీ పుట్టిన ప్రేమగలదియు యదార్థముగా భాషించునది ఇంటిపనులలో నేర్పరిగలదై యుండును.

**హస్తానక్షత్ర జనన దోషములు :** తృతీయ పాదమున స్త్రీ పుట్టిన తల్లికికి పురుషుడు పుట్టిన తండ్రికిని దోషము మిగతా 1-2-4 పాదములందు పుట్టిన వారికి ఏ దోషం లేదు. ఈ సామాన్య దోషశాంతికి తైలావేక్షణము జరుపవలెను. పురుషుడు పుట్టిన విద్యావంతుడు ధనవంతుడు, పరులకు మేలు చేయువాడు, సౌఖ్యవంతుడు, ధైర్యసాహసములు గలవాడు, స్త్రీ పుట్టిన శీలగుణ సౌందర్యవతి గౌరవ ప్రతిష్టలు గలదై యుండును.

**చిత్తా నక్షత్ర జనన దోషముము :** 1-2 పాదములలో పురుషుడు పుట్టిన తండ్రికిని స్త్రీ పుట్టిన తల్లికిని 'దోషము'. ఈ దోషశాంతికి మహాన్యాస రుద్రాభిషేకము నవగ్రహ జపము జరిపించుకొనవలెను. శేషించిన 4వ పాదమున పుట్టిన సామాన్య దోషము కలదు. వస్త్రదానమీయవలెను. పురుషుడు పుట్టిన వస్త్రదారణలో అభిలాషగలవాడును ప్రయాణములతో సమయాన్ని హెచ్చుగా వెచ్చించువాడు ధనవంతుడు భోగభాగ్యములను అనుభవించువాడు స్త్రీ పుట్టిన రూపవతి ఆభరణములు ధరించునది సౌఖ్యమును అనుభవించునదియగును.

**స్వాతి నక్షత్ర జనన దోషములు :** ఏ పాదములో జన్మించినమా దోషము లేదు. పురుషుడు జన్మించిన ధర్మ ప్రవర్తనగలవాడు వ్యవహారములలో పైచేయి గలవాడు విద్యావంతుడు ధైర్య సాహసములు గలవాడు స్త్రీ పుట్టిన కీర్తి ప్రతిష్టలు గడించునది మంచి నడక గలదై యుండును.

**విశాఖ నక్షత్ర జనన దోషముములు :** ఏపాదములో పురుషుడు పుట్టిన బావ మరిదికి లేక మరదలికి స్త్రీ పుట్టిన ఎడల మరిదికి దోషం గలదు. దోసశాంతికై మహాన్యాసరుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు తైలావేక్షణము జరిపంచుకొనవలెను. పురుషుడు పుట్టిన సూక్ష్మంగా విచారించువాడును వోర్వలేని తనంగలవాడు ఇంద్రియ నిగ్రహం గలవాడును దయాదాక్షిన్యముగలవాడును, స్త్రీ పుట్టిన మనోహర శరీరము గలది బంధువులయందు ప్రేమగలది తీర్థయాత్రల యందు అభిలాషగలదై యుండును.

**అనూరాధ నక్షత్ర జనన దోషములు :** ఏ పాదములో పుట్టినను దోషము లేదు. శుభప్రదము పురుషుడు పుట్టిన శూరత్వము గలవాడు విదేశాలలో యుండువాడు. రాజకీయ కార్యములయందాసక్తి చూపువాడు, రూపవంతుడు. స్త్రీ పుట్టిన ఉపకారము చేయునది తగిన స్నేహితులు గలది సౌందర్యవంతురాలుగా ఉండును.

**జ్యేష్ఠా నక్షత్ర జనన దోషములు :** ఏ పాదమందు పుట్టినను దోషాధిక్యము కావున యధావిధిగా మహాన్యాస రుద్రాభిషేకం, నక్షత్ర నవగ్రహ జపములు తైలావేక్షణము జరిపించుకొనవలెను. గోవుదానమీయవలెను. పురుషుడు పుట్టిన ధనవంతుడు శ్రమలనోర్చువాడు అసత్యమందు జంకువాడు స్త్రీ జన్మించిన అధిక ప్రేమగలదియు కోపాధిక్యం గలదై యుండును.

**జ్యేష్ఠా నక్షత్ర గండములు :** జ్యేష్ఠా నక్షత్రాదయంత ఘడియలను 10 భాగములుగా జేయగా ఒక్కొక్క భాగమునకు ఈ విధంగా ఫలితములు చూచుకొనగలరు. 1వ భాగమున తల్లికిని 2వ భాగం తల్లి యొక్క తండ్రికి 3వ భాగమున తండ్రి సోదరులకు 4వ భాగము శిశువు తల్లికిని 5వ భాగము శిశువునకు 6వ భాగము వంశీయులకు 7వ భాగము మామకు 8వ భాగమున మేమనమామకు 9వ భాగము ఆత్మబంధువులకు 10వ భాగమున అందరకును.

**మూల నక్షత్ర జనన దోషములు :** ప్రథమ పాదమందు జననమైన తండ్రికిని ద్వితీయపాదమున పుట్టిన తల్లికిని తృతీయపాదమున ధననాశనము నాల్గవపాదమునందు పురుషుడు పుట్టిన స్వదోషము స్త్రీ పుట్టిన తల్లిపక్షం వారికి దోషము ఈ దోషనివారణకు యధాశాస్త్రంగా మహాన్యాసపూర్వక రుద్రాభిషేకం నక్షత్ర నవగ్రహజపములు తైలావేక్షణము మహిష దానము చేయవలయును. పురుషుడు పుట్టిన ధనవంతుడు ఆత్మాభిమానము గలవాడు సౌఖ్యవంతుడు ధర్మశాస్త్ర ప్రవర్తన గలవాడు బంధువులనాదరించువాడు స్త్రీ పుట్టిన విద్యా, ధనం గలదియు స్వల్ప సౌఖ్యంగలదై యుండును.

**మూల నక్షత్రద్వాదశ (12) గండములు :** మూల నక్షత్ర ఆద్యంతమును 12 భాగములుగా చేసి ఫలితము చూసుకొనవలెను. 1వ భాగము తండ్రికిని 2వ భాగము తల్లికిని 3వ భాగమున సోదరులకు 4వ భాగము ఆడతోబుట్టువులకు 5వభాగము మేనమామకు 6వ భాగము తండ్రితోబుట్టువుకు 7వ

భాగము ధననాశనము 8వ భాగము పినతండ్రికిని 9వ భాగము శిశువునకు 10 భాగము దరిద్రము 11వ భాగము సంపద 12వ భాగము లాభము.

**పూర్వాషాఢ నక్షత్ర జనన దోషములు :** తృతీయ పాదమున పురుషుడు పుట్టిన తండ్రికి, స్త్రీ పుట్టిన తల్లికి దోషము ఈ దోషశాంతికి రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు చేయించుకొనవలెను. మిగతా 1-2-4 పాదముల యందు పుట్టిన స్వల్పదోషము సామాన్య శాంతి చేయవలెను. పురుషజననమైన వినయ వధేయతలు గలవాడు ప్రసన్న వదనుడు, త్యాగగుణము గలవాడు అభిమానవంతుడు స్త్రీ జన్మించిన ఆదరాభిమానము గలదియు విశాలమైన నేత్రములు గలదై యుండును.

**ఉత్తరాషాఢ నక్షత్ర జనన దోషములు :** ఏ పాదములో పుత్రికా పుత్రులు పుట్టినను దోసము లేదు. పురుషుడు పుట్టిన ధార్మికుడు విశ్వాసయోగ్యుడు సంతానం గలవాడు సౌందర్యవంతుడు మంచి భార్య గలవాడు. స్త్రీ పుట్టిన అనురాగ పూరిత మనస్సు గలదియు భోగభాగ్యములను అనుభవించునదై యుండును.

**శ్రవణా నక్షత్ర జనన దోషములు :** ఏ పాదములోనైనా పుత్రికా పుత్రులు జన్మించిన దోషము లేదు. పురుషుడు పుట్టిన పాండిత్యము గవాడు ఉదార స్వభావము గలవాడు వాదనలో సమర్థుడు విజయము పొందువాడు స్త్రీ జన్మించిన దానధర్మములు చేయునై యుండును.

**ధనిష్ఠా నక్షత్ర జనన దోషములు :** ఏ పాదములో జన్మించినను దోషము లేదు. పురుషుడు జన్మించిన దురలవాట్లు గలవాడు, క్రూరస్వభావం గలవాడు, అపవాదులు చేయువాడు స్త్రీ జన్మించిన ఇతిహాసములందు ఆసక్తి గలది తోటి స్త్రీల నాదరించునది ధర్మప్రవర్తనగలదై యుండును.

**శతభిషా నక్షత్ర జనన దోషములు :** పుత్రికా పుత్రుల జననము ఏపాదములో జరిగినను దోషము లేదు. పురుషుడు పుట్టిన కపటము గలవాడు దుష్టుడు, ఘందరాస్యుడు భార్యయందు ప్రేమాధిక్యము గలవాడు స్త్రీ పుట్టిన దేవతా గురుభక్తి గలదియు ఇంటిపనులలో నేర్పరియై యుండును.

**పూర్వాభాద్ర నక్షత్ర జనన దోషములు :** ఏ పాదములో పుత్రికా పుత్రులు జననమైన సామాన్య దోషము శాంతి జరిపించుకొనవలెను. పురుషుడు పుట్టిన దురలవాట్లు గలవాడు. పరస్త్రీలయందాసక్తి గలవాడు తరచుగా అవకతవకలు చేయువాడు స్త్రీ పుట్టిన ధనవంతురాలును దైవభక్తి గలది సత్సంతానము గలదియు వినయువిధేయత ప్రవర్తన గలదై యుండును.

**ఉత్తరాభాద్ర నక్షత్ర జనన దోషములు :** ఏ పాదమున జన్మించినను దోషములేదు. పురుషుడు పుట్టిన సంతానం గలవాడు, ధార్మికకార్యము చేయువాడు, శత్రువులను జయించువాడు స్త్రీ పుట్టిన గౌరవప్రతిష్టలు గలది, ఓర్పుగలదై యుండును.

**రేవతి నక్షత్ర జనన దోషములు :** మొదటి మూడు పాదంలలో పుత్రికా పుత్రులు జన్మించిన ఎట్టి దోషము లేదు నాల్గవపాదములో పుత్రుడు పుట్టిన తండ్రికి శిశువునకు, స్త్రీ జన్మించిన తల్లికిని శిశువునకు దోషము. ఈ దోషశాంతికి నక్షత్ర నవ గ్రహజపము, రుద్రాభిషేకము జరిపించుకొనవలెను. సువర్ణదానమీయవలెను. పురుషుడు పుట్టిన ధనవంతుడు, నలుగురిలో పేరు సంపాదించువాడును, సౌందర్యవంతుడును స్త్రీ పుట్టిన శరీరక పుష్టిగలదై, ఆచారవంతురాలై వుండును.

**జననకాల తిథి దోషములు :**

పంచమి, షష్టి, దశమి తిథులయందును బహుళ చతుర్దశియందును తిథిని 6వ భాగాలు వేయగా 1వ భాగము శుభము 2వ తండ్రికిని, 3వ తల్లికిని, 4వ మేనమామకు, 5వ అన్నదమ్ములకు, 6వ శివుశువనకు దోషమును మరియు అమావాస్య తిథిని 6వ శుభ మనియు మిగతా తిథి దోషం వర్జ్యదుర్ముహూర్తములందు జననమైన తండ్రికిని దోషం, ఇవికాక గ్రహ బాలారిష్ట దోషాదులు దైవజ్ఞులగు పురోహితులచే తెలుసుకొని తగిన విధంగా శాంతిజేసి సువర్ణ, తండ్రుల దానము చేసిన సకల శుభములు చేకూరును. నక్షత్ర దోషమునే ప్రధానంగా చెప్పబడినను పై దోషములు కూడా కీడు కలుగజేయును.

**వర్గోత్తమ హంశలు :**

చు-వా-హ-హి-మో-పో-రా-నె-బె-బో-సీ-చి పైవి మొదటి అక్షరము గల జన్మనామం వర్గోత్తమ హంశలగును. వీరలు సదాసుఖముగా నుందురు.

**గౌరీ పంచాంగము**

**(దివా ముహూర్తములు)**

| గం॥ ని॥ | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 7-30 | ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| 9-00 | లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| 10-30 | విషం | ఉద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| 12-30 | అమృ | లాభం | లాభం | ఉద్యో | లాభం | కలహం | ఉద్యో |
| 1-30 | శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం |
| 3-00 | ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | సుఖం | లాభం |
| 4-30 | అమృ | లాభం | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| 6-00 | విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

**(రాత్రి ముహూర్తములు)**

| గం॥ ని॥ | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 7-30 | శుభం | రోగం | జ్వరం | లాభం | సుఖం | అమృ | విశం |
| 9-00 | అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| 10-30 | జ్వరం | ఉద్యో | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| 12-30 | రోగం | ధనం | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| 1-30 | కలహం | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహం |
| 3-00 | లాభం | అమృ | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| 4-30 | ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| 6-00 | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

## పుష్కరములు వాటి వివరములు

| గురువు | నదిపుష్కరం | గురువు | నదిపుష్కరం |
|---|---|---|---|
| మేషరాశి | గంగా | వృషభరాశి | నర్మదా |
| మిధునరాశి | సరస్వతీ | కర్కాటకరాశి | యమునా |
| సింహరాశి | గోదావరి | కన్యారాశి | కృష్ణా |
| తులా | కావేరి | వృశ్చికరాశి | తామ్రపర్ణి |
| ధనస్సు | సింధూ | మకరరాశి | తుంగభద్రా |
| కుంభరాశి | భీమరతి | మీనరాశి | ప్రణీతా |

## వ్యాపారస్థలము (దుకాణము) తెరచు, మూయు జాగ్రత్తలు

ఉదయము లేచి పరిశుద్ధుడై, ఇష్టదేవతలను పూజించి దేవుని స్మరిస్తూ, దుకాణం తాళము తీసి ఎవరితో మాట్లాడక కుడికాలుమోపి, లోనికి కేగి మహాలక్ష్మికి నమస్కరించి దుకాణమును శుభ్రపరచవలెను. దేవతలకు ధూపదీపనైవేద్యము చూపి వ్యాపారారంభము చేయవలెను. సాయంత్రము దుకాణము మూయునప్పుడు ఓం నమో భగవతే మహా దుర్గే మమపణ్యాగేహ వివిధ వస్తు ద్రవ్యాదీన్ అగ్ని వాయు జల మహాంధకార ఉల్కాపాత, చోర, వైరి, భూత, విద్యుదనల శస్త్రాస్త్రాదిభ్యః సర్వాయుధ హస్తాభ్యాం రక్ష రక్ష సర్వతోమాం రక్ష రక్ష హురుళిస్వాహా: అని తాళము వేయవలెను.

కార్తవీర్యార్జునో నామరాజా బాహుసహస్రవాన్ తస్యస్మరణ మాత్రేణ చోర బాధా వినశ్యతి ॥ అని తాళం గుంజిచూచి

॥ఓం॥ నమో భగవతే కార్తవీర్యార్జుననాయ మహాభుజ పరిపాలిత సప్తద్వీపాయ అస్మద్వస్తు ద్రవ్యాది విలుంపక చోరాన్ ఠఠఠ ఓం ॥ ప్రాం-ధ్రీం-క్లీం-బ్లూం-ఆం-హ్రిం-క్రోం-శ్రీం-హుం-ఫట్ కార్తవీర్యార్జునాయ స్వాహా:

అని తాళం మరల గుంజి చూచి నమస్కరించి ఇష్టదేవతను స్మరిస్తూ గృహమునకు వెళ్లవలెను.

## రాశి ఫలితములు

వివరణ : ఈ గ్రహచారఫలములు కేవలము 108 మందికే సూచితము. కోట్లాది జనాభా గల దేశమందు వీనినే ప్రమాణముగా యెంచుకోకూడదు. ప్రతివారి జనన సమయమునగల గ్రహ ఫలములే వాస్తవము. జన్మ నక్షత్రమునకు సూచితములు. నామ నక్షత్రంతో చూచుకొనువారికి 10 శాతం ఫలితములు కలుగును. అశుభ ఫలములు కలిగినప్పుడు తగిన శాంతి చేసుకోవలెను. శుభములైనను, అశుభములైనను ఒకరికే వర్తించవు. జాతకఫలము, వయస్సు వృత్తి ననుసరించి యుండును. సర్వ భూతములయందు దయగలిగి సత్యధర్మములు కలవారికి కష్టములు కలుగవని గ్రహించవలెను.

పితృ పంచకము - తన్ను గన్నవాడు, తనకు వడుగు చేసిన వాడు, తనకు చదువు చెప్పినవాడు, విపత్తున అన్నము పెట్టిన వాడు, ఆపదయందు, భయమును తీర్చి రక్షించినవాడు.

పంచామృతములు - ఉదకము, పాలు, పెరుగు, నెయ్యి, తేనె.

పంచాంగములు - తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము

షడ్రసములు - ఉప్పు, పులుపు, కారము, తీపి, చేదు, వగరు

అరిషెడ్వర్గములు - కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము

నవరసములు - శృంగారము, హాస్యము, కరుణము, క్రోదము, రుద్రము, వీరము, భయానకము, భీభత్సము, అద్భుతము, శాంతము.

నవరత్నములు - వజ్రము, వైఢూర్యము, గోమేధికము, పుష్యరాగము, మరకతము, మాణిక్యము, ప్రవాళము, ముత్యం, నీలము.

నవ ధాన్యములు - వడ్లు, ఉలవలు, పెసలు, మినుములు, నువ్వులు, గోధుమలు, అనుములు, కందులు, శనిగెలు

దశ దానములు - గోధానము, భూ ధానము, తిల ధానము, హిరణ్య దానము, అజ్య దానము, వస్త్ర దానము, దాన్య దానము, రజత దానము, లవణ దానము.

షోడశోపచారములు - ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, అచమనీయము, అభిషేకము, వస్త్రము, యజ్ఞవతారము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము.

## గాయిత్రి మంత్రములు

ఓం తత్పురుషాయ విద్మహే వక్ర తుండాయ ధీమహి తన్నో దంతిః ప్రచోదయాత్

ఓం దాశరథాయ విద్మహే జానకీ వల్లభాయ ధీమహి తన్నో రామః ప్రచోదయాత్

ఓం వాసుదేవాయ విద్మహే రుక్మిణీ వల్లభాయ ధీమహి తన్నో కృష్ణః ప్రచోదయాత్

ఓం వెంకటేశాయ విద్మహే శ్రీమన్నాధాయ ధీమహి తన్నో శ్రీశః ప్రచోదయాత్

ఓం హంస హంసాయ విద్మహే పరమహంసాయ ధీమహి తన్నో హంసః ప్రచోదయాత్

ఓం మహాలక్ష్మైచ విద్మహే విష్ణు పత్నైచ ధీమహే తన్నో లక్ష్మీ ప్రచోదయాత్

ఓం ఆదిత్యాయ విద్మహే సహస్ర కిరణాయ ధీమహి తన్నో సూర్య ప్రచోదయాత్

ఓం ఆంజనేయాయ విద్మహే వాయు పుత్రాయ ధీమహి తన్నో హనుమః ప్రచోదయాత్

ఓం సంతోషి క్ష్వీచ విద్మహే సౌభాగ్య క్ష్వీచ ధీమహి తన్నో హ్లాదః ప్రచోదయాత్

ఓం తత్పురుషాయ విద్మహే స్వర్ణ పక్షాయ ధీమహి తన్నో గరుడః ప్రచోదయాత్

ఓం క్షీర పుత్రాయ విద్మహే అమృతత్వాయ ధీమహి తన్నో చంద్రః ప్రచోదయాత్

ఓం నారసింహాయ విద్మహే వజ్ర నఖాయ ధీమహి తన్నో నృసింహ ప్రచోదయాత్

ఓం సంఘాయచ విద్మహే కామ మాలాయ ధీమహి తన్నో గౌరిః ప్రచోదయాత్

ఓం తత్పురుషాయ విద్మహే మహా సేనాయ ధీమహి తన్నో శణ్ముఖః ప్రచోదయాత్

ఓం జలబింబాయ విద్మహే నీల పూర్ణాయ ధీమహి తన్నో స్థంభః ప్రచోదయాత్

ఓం తత్పురుషాయ విద్మహే అత్రి పుత్రాయ ధీమహి తన్నో దత్తాః ప్రచోదయాత్

ఓం గోపాలాయ విద్మహే గోపి జన వల్లభాయ ధీమహి తన్నో గోపాలాః ప్రచోదయాత్

ఓం వేదాత్మనాయ విద్మహే హిరణ్య గర్భాయ ధీమహి తన్నో బ్రహ్మ ప్రచోదయాత్

ఓం జ్ఞాన రూపాయ విద్మహే బ్రహ్మ ప్రియాయ ధీమహి తన్నో వాణి ప్రచోదయాత్

ఓం సీతామాతాయ విద్మహే జనక సంతాయ ధీమహి తన్నో భూజాత ప్రచోదయాత్

ఓం భాస్కరాయ విద్మహే మహాతేజాయ ధీమహి తన్నో సూర్య ప్రచోదయాత్

ఓం వైవస్యతాయ విద్మహే ధండ హస్తాయ ధీమహి తన్నో యమః ప్రచోదయాత్

ఓం గురుదేవాయ విద్మహే పరబ్రహ్మణై ధీమహి తన్నో గురుః ప్రచోదయాత్

ఓం దేవీ బ్రహ్మణి విద్మహే మహా శక్త్యైచ ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్

ఓం దేవరాజాయ విద్మహే వజ్ర హస్తాయ ధీమహి తన్నో ఇంద్ర ప్రచోదయాత్

ఓం వైశ్వ నారాయ విద్మహే పాశ హస్తాయ ధీమహి తన్నో వరుణః ప్రచోదయాత్

ఓం జగత్ప్రాణాయ విద్మహే గంధ వాహాయ ధీమహి తన్నో వాయుః ప్రచోదయాత్

ఓం ఉర్విధరాయ విద్మహే మహానాగాయ ధీమహి తన్నో శేషః ప్రచోదయాత్

ఓం తత్పురుషాయ విద్మహే మహా మీనాయ ధీమహి తన్నో మత్స్య ప్రచోదయాత్

ఓం ధనుర్ధరాయ విద్మహే సర్వ సిద్ధ్యైచ ధీమహి తన్నో దరాః ప్రచోదయాత్

ఓం ముని నాథాయ విద్మహే మార్కండేయాయ ధీమహి తన్నో ఋషిః ప్రచోదయాత్

# తులసితో చేసుకొనదగిన గృహ వైద్యాలు

రోజు కేవలం ఐదు తులసి ఆకులు తినడం వల్ల అనేక రోగాల నుండి రక్షణ కలుగుతుంది.

రోజు రెండు మూడు చంచాల తులసాకుల రసాన్ని పరగడుపున తీసుకుంటే శారీరక బలం, జ్ఞాపక శక్తి పెరుగుతాయి. శరీర ఆకారం ఆకర్షణీయంగా మారుతుంది.

నాలుగు మిరియపు గింజలు పదకొండు తులసాకులు తీసికొంటే మలేరియా, అప్పుడప్పుడు వచ్చే జ్వరం, ఇతర జ్వరాలు తగ్గిపోతాయి.

రక్తంలో ఉన్న కోలస్ట్రాల్‌ను తులసి అతి శీఘ్రంగా మామూలు స్థితికి తీసుకువస్తుంది.

శరీరం బరువు తగ్గించడానికి, పెంచడానికి కూడా తులసి పని చేస్తుంది.

తులసిని సేవించడం వల్ల శరీరం పెరుగుదల హెచ్చుతగ్గులు కాక సమమైన పద్ధతిలో ఉంటుంది.

కొంచెం ఉప్పు కలిపిన తులసిరసం రెండు మూడు చుక్కలు స్పృహ తప్పి పడిపోయిన వాళ్ళ ముక్కు రంధ్రాలలో వేస్తే వాళ్ళు వెంటనే తేరుకుంటారు.

తులసి దళాలు వేసి కాచిన టీ జ్వరానికి, జలుబుకి, ఒళ్లు నొప్పులకి చాలా మంచిది.

పది గ్రాముల తులసిరసం ఐదు గ్రాముల తేనె కలిపి తీసుకొంటే ఎక్కిళ్ళు, ఉబ్బసం తగ్గుతాయి.

తులసాకు కషాయంలో కొంచెం సైంధవలవణం, శొంఠి పొడి కలిపి తీసుకుంటే మలబద్ధకము పోతుంది.

మధ్యాహ్నం భోజనం తరువాత గాని, మరెప్పుడైనాకాని ఐదు తులసిఆకులు నమిలిమింగితే జీర్ణశక్తి పెరుగుతుంది.

పది గ్రాముల తులసి రసంలో ఐదు గ్రాముల తేనె, ఐదు గ్రాముల నల్ల మిరియాల పొడి కలిపి సేవిస్తే జఠరాగ్ని మాంద్యం తొలగిపోతుంది.

ప్రతి రోజు ఉదయం నీళ్ళల్లో ఐదు తులసాకులు వేసి వాటితో ఆనీల్ళు తాగితే వ్యాధులు రాకుండా కాపాడుంతుంది మెదడుకు ఉన్న దుర్బలత్వాన్ని పోగొట్టి జ్ఞాపక శక్తిని పెంపొందిస్తుంది.

తులసి రసం వెచ్చవేసి నాలుగైదు చుక్కలు చెవిలో వేస్తే చెవిపోటు తగ్గుతుంది.

నాలుగైదు లవంగాలు వేయించి వాటిని తులసి ఆకులతో తింటే అన్ని రకాల దగ్గులు శాంతిస్తాయి.

తులసి రసం వెచ్చవేసి నాలుగైదు చుక్కలు చెవిలో వేస్తే చెవిపోటు తగ్గుతుంది.

తులసి రసం రాసి మెల్లిగా మర్ధిస్తే తామర, గజ్జి మైదలైన చర్మ రోగాలు తగ్గుతాయి.

గజ్జి, దురద తగ్గడానికి నిమ్మకాయ రసంతో తులసాకులు నూరి దానిని పట్టించవచ్చు.

తులసిలో ఉన్న ప్రధానమైన విశేషం ఏమిటనగా ఇది స్త్రీలు, పురుషులు, బాలలు, వృద్ధులు అనే భేదం లేకుండా అందరి రోగాలనూ పోగొడుతుంది.

| | | | |
|---|---|---|---|
| మీన 11 | మేష 0 | వృష 1 | మిథు 2 |
| మీన 11 | రాశి | సంఖ్యా | మిథు 2 |
| మక 9 | | | సింహ 4 |
| ధను 8 | వృశ్చి 7 | తులా 6 | కన్యా 5 |

| | | | |
|---|---|---|---|
| మీన బ్రాహ్మణ | మేష క్షత్రియ | వృష వైశ్య | మిథు శూద్ర |
| కుంభ శూద్ర | రాశి | వర్ణములు | కర్క బ్రాహ్మణ |
| మక వైశ్య | | | సింహ క్షత్రియ |
| ధను క్షత్రియ | వృశ్చి బ్రాహ్మణ | తులా శూద్ర | కన్యా వైశ్య |

| | | | |
|---|---|---|---|
| మీన పురుష | మేష పురుష | వృష స్త్రీ | మిథు నపుం |
| కుంభ నపుం | రాశి | లింగము | కర్క స్త్రీ |
| మక నపుం | | | సింహ నపుం |
| ధను పురుష | వృశ్చి పురుష | తులా స్త్రీ | కన్యా నపుం |

| | | | |
|---|---|---|---|
| మీన 1 | మేష 1 | వృష 7 | మిథు 7 |
| కుంభ 5 | శుభ | ద్విర్ద్వాదశ కములు | కర్క 2 |
| మక 5 | | | సింహ 2,3 |
| ధను 6 | వృశ్చి 6 | తులా 4 | కన్యా 3,4 |

| | | | |
|---|---|---|---|
| మీన కుజ | మేష గురు | వృష శని | మిథు శుక్ర |
| కుంభ శుక్ర | రాశి | యోగకారకులు | కర్క రవి |
| మక శుక్ర | | | సింహ కుజ |
| ధను కుజ | వృశ్చి గురు | తులా శని. | కన్యా శుక్ర |

| | | | |
|---|---|---|---|
| మీన గురు | మేష కుజ | వృష శుక్ర | మిథు బుధ |
| కుంభ శని | రాశి | గ్రహాధిపతి | కర్క చంద్ర |
| మక శని | | | సింహ రవి |
| ధను గురు | వృశ్చి కుజ | తులా శుక్ర | కన్యా బుధ |

| | | | |
|---|---|---|---|
| మీన జల | మేష చతు | వృష చతు | మిథు మాన |
| కుంభ మాన | రాశి | జీవము | కర్క జల |
| మక జల | | | సింహ వన |
| ధను మాన | వృశ్చి కీట | తులా మాన | కన్యా మాన |

| | | | |
|---|---|---|---|
| మీన దిన | మేష రాత్రి | వృష రాత్రి | మిథు రాత్రి |
| కుంభ దిన | రాశి | బలకాలము | కర్క రాత్రి |
| మక రాత్రి | | | సింహ దిన |
| ధను రాత్రి | వృశ్చి దిన | తులా దిన | కన్యా దిన |

| | | | |
|---|---|---|---|
| మీన 1 | మేష 2 | వృష 2 | మిథు 3 |
| కుంభ 1 | అశుభ | ద్విర్ద్వాదశ కములు | కర్క 3 |
| మక 5 | | | సింహ |
| ధను 5 | వృశ్చి 4 | తులా 4 | కన్యా |

| | | | |
|---|---|---|---|
| మీన శుక్ర 27 | మేష రవి 10 | వృష చంద్ర 3 | మిథు రాహు 20 |
| కుంభ | రాశి | పరమ ఉచ్ఛ భాగములు | కర్క గురు 5 |
| మక కుజ28 | | | సింహ |
| ధను రాహు20 | వృశ్చి చంద్ర 3 | తులా రవి10 | కన్యా శుక్ర27 |

| | | | |
|---|---|---|---|
| మీన 360 | మేష 30 | వృష 60 | మిథు 90 |
| మీన 330 | రాశి | భాగలు | మిథు 120 |
| మక 300 | | | సింహ 150 |
| ధను 270 | వృశ్చి 240 | తులా 210 | కన్యా 180 |

| | | | |
|---|---|---|---|
| మీన చేపలు | మేష మేక | వృష ఎద్దు | మిథు స్త్రీ |
| కుంభ కడవ | రాశి | రూపము | కర్క పీత |
| మక మొసలి | | | సింహ సింహం |
| ధను విల్లు | వృశ్చి తేలు | తులా త్రాసు | కన్యా పడుచు |

| | | | |
|---|---|---|---|
| మీన ౪-౧ 1-37 | మేష ౪-౨౩ 1-45 | వృష ౫-౧ 2-1 | మిథు ౫-౨౯ 2-12 |
| కుంభ ౪-౭ 1-39 | రాశి | ఆంధ్రప్రదేశ్ లగ్న ప్రమాణములు | కర్క ౫-౩౦ 2-12 |
| మక ౪-౩౯ 1-52 | | | సింహ ౫-౧౭ 2-7 |
| ధను ౫-౧౬ 2-6 | వృశ్చి ౫-౩౩ 2-13 | తులా ౫-౨౫ 2-10 | కన్యా ౫-౧౫ 2-6 |

| | | | |
|---|---|---|---|
| మీన 1 | మేష 5 | వృష 2 | మిథు 4 |
| కుంభ 3 | ప్రీతి షష్టాష్ట | కములు | కర్క 6 |
| మక 4 | | | సింహ |
| ధను 6 | వృశ్చి 5 | తులా 2 | కన్యా 3 |

| | | | |
|---|---|---|---|
| మీన బుధ15 | మేష శని20 | వృష | మిథు కేతు20 |
| కుంభ | రాశి | పరమ నీచ భాగములు | కర్క కుజ28 |
| మక గురు5 | | | సింహ |
| ధను రాహు20 | వృశ్చి చంద్ర3/20 | తులా రవి10 | కన్యా శుక్ర27 |

| | | | |
|---|---|---|---|
| మీన ద్విస్వభావ | మేష చర | వృష స్థిర | మిథు ద్విస్వభావ |
| కుంభ స్థిర | రాశి | స్వభావము | కర్క చర |
| మక చర | | | సింహ స్థిర |
| ధను ద్విస్వభావ | వృశ్చి స్థిర | తులా చర | కన్యా ద్విస్వభావ |

| | | | |
|---|---|---|---|
| మీన 30 | మేష 31 | వృష 31 | మిథు 31 |
| కుంభ 30 | శా॥శక | మాసములు | కర్క 31 |
| మక 30 | | | సింహ 31 |
| ధను 30 | వృశ్చి 30 | తులా 30 | కన్యా 30 |

| | | | |
|---|---|---|---|
| మీన ౦-౫౬ 0-22 | మేష ౩-౪ 1-14 | వృష ౨-౨౧ 0-56 | మిథు ౪-౨౪ 1-46 |
| కుంభ ౩-౧౭ 1-19 | రాశి | పుష్కరాంశ ఘ॥గంటలు | కర్క ౧-౧౮ 0-31 |
| మక ౨-౧౦ 0-52 | | | సింహ ౩-౧౪ 1-18 |
| ధను ౩-౪౧ 1-28 | వృశ్చి ౧-౧౭ 0-31 | తులా ౪-౨౦ 1-44 | కన్యా ౨-౨౮ 0-59 |

| | | | |
|---|---|---|---|
| మీన 2 | మేష 1 | వృష 6 | మిథు 3 |
| కుంభ 5 | శుభ | ద్విర్ద్వాదశ కములు | కర్క 5 |
| మక 4 | | | సింహ 4 |
| ధను 6 | వృశ్చి 3 | తులా 2 | కన్యా 1 |

| | | | |
|---|---|---|---|
| మీన | మేష కుజ0-18 | వృష చంద్ర4-30 | మిథు |
| కుంభ శని0-20 | రాశి | మూల త్రికోణభాగములు | కర్క |
| మక | | | సింహ రవి0-20 |
| ధను గురు0-13 | వృశ్చి | తులా శుక్ర0-10 | కన్యా బుధ16-20 |

| | | | |
|---|---|---|---|
| మీన జల | మేష అగ్ని | వృష భూమి | మిథు వాయు |
| కుంభ వాయు | రాశి | తత్వం | కర్క జల |
| మక భూమి | | | సింహ అగ్ని |
| ధను అగ్ని | వృశ్చి జల | తులా వాయు | కన్యా భూమి |

| | | | |
|---|---|---|---|
| మీన మార్చి31 | మేష ఏప్రిల్30 | వృష మే31 | మిథు జూన్30 |
| కుంభ ఫిబ్ర28 | ఇంగ్లీషు | మాసములు | కర్క జూలై31 |
| మక జన31 | | | సింహ ఆగ31 |
| ధను డిసెం31 | వృశ్చి నవం30 | తులా అక్టో31 | కన్యా సెప్టె30 |

| | | | |
|---|---|---|---|
| మీన౩ శుక్ర,ఆశ్లే 12 | మేష౬ ఆది,మఘ 1 | వృష౪ శని, హస్త 5 | మిథు౭ సోమ,స్వాతి 9 |
| కుంభ౪ గురు,ఆర్ద్ర 11 | రాశి ఘాతచక్రము | తిథి, వారము నక్షత్రము చంద్రః | కర్క౬ బుధ,అనూ 2 |
| మక౧౨ ౧౨ 1-52 | | | సింహ౯ శని,మూల 9 |
| ధను౨ శుక్ర,భర 4 | వృశ్చి౧౦ శుక్ర,రేవ 7 | తులా౧౨ గురు,శత 3 | కన్యా౭ శని,శ్రవ 10 |

| | | | |
|---|---|---|---|
| మీన 6 | మేష 1,7 | వృష 2,8 | మిథు 3 |
| కుంభ 5 | శుభ నవ | పంచకములు | కర్క |
| మక 8 | | | సింహ 1,4 |
| ధను 4,7 | వృశ్చి 6 | తులా 3,5 | కన్యా 2 |

| | | | |
|---|---|---|---|
| మీన 3 | మేష | వృష | మిథు 2 |
| కుంభ 2 | రాశి | మూల త్రికోణభాగములు | కర్క 4,3 |
| మక 1 | | | సింహ |
| ధను | వృశ్చి 4 | తులా | కన్యా 1 |

# గీతా సారము



- ★ మిత్రమా ఎందుకు బాధ పడుచున్నావు.
- ★ అయిందేదో అయింది - పోయిందేదో పోయింది.
- ★ ఈ లోకానికి వచ్చేటప్పుడు వట్టి చేతులతో వచ్చావు.
- ★ పోయేటప్పుడు లగేజీతో పోవాలనుకుంటున్నావు.
- ★ అందుకే నీకీ ఆరాటం, అశాంతి, నీవేమి పోగొట్టుకున్నావని విచారిస్తున్నావు.
- ★ నీవేమి తెచ్చావని - నీవు పోగొట్టుకొంటావు.
- ★ నీవేమి సృష్టించావని - నీకు నష్టం వచ్చింది ?
- ★ ఏదైతే ఇచ్చావో - ఇక్కడిదే ఇచ్చావు.
- ★ ఈనాడు నీవు నీ సొంతం అనుకున్నదంతా - నిన్న ఇంకొకరిది రేపు మరొకరి సొంతం కాగలదు.
- ★ కావున జరిగేదేదో జరగక మానదు - అనవసరంగా ఆందోళన పడకు.
- ★ ఆందోళన అనారోగ్యానికి మూలం ప్రయత్నలోపం లేకుండా ప్రయత్నించు. ఫలితం ఏదైనా దైవ ప్రసాదంగా స్వీకరించు. శాంతి నీ వెంట ఇంట చెంత ఉండగలదు.